# గాంధీ తత్త్వము

ACC. NO. 11246

రచన

చక్రవర్తి రాజగోపాలాచారి

అనువాదం

అడపా రామకృష్ణరావు

గాంధీ సాహిత్య ప్రచురణాలయం

[ ఆంధ్రప్రదేశ్ గాంధీ స్మారకనిధి ]

హైదరాబాదు-20

తొలికూర్పు
2000 ప్రతులు

1969
జులై

Acc No. 11246

గాంధీజీ తత్త్వాన్ని పెంపొందించే ఉద్దేశంతో కేంద్రప్రభుత్వ విద్యాశాఖవారు రూపొందించిన ప్రణాళిక ననుసరించి చేసిన ఉపన్యాసపరంపరను తెలుగులోనికి అనువాదం చేయించి ప్రచురించుటకు గాంధీ సాహిత్య ప్రచురణాలయమునకు భారతప్రభుత్వ విద్యాశాఖవారు అనుమతించినందుకు కృతజ్ఞులము.

సర్వోదయ ప్రెస్
విజయవాడ_6

వెల
75 పైసలు

# ప్రకాశకుల నివేదన

భారతప్రభుత్వ విద్యాశాఖవారు గాంధీతత్త్వాన్ని పెంపొందించటానికి ఒక ప్రణాళికను సిద్ధంచేశారు. భారత దేశమందలి ఏదోఒక విశ్వవిద్యాలయంలో ప్రతి సంవత్సరం గాంధీతత్త్వాన్ని తరచిచూచిన ప్రముఖునిచే మూడు ఉపన్యాసాలు గాంధీతత్త్వాన్నిగురించి ఇప్పిస్తారు. ఇది దేశానికి ఒక గొప్పమేలు అనవచ్చు. గాంధీజీ జీవించియున్నకాలంలో ఆయన ఆజ్ఞానువర్తులుగా భారతప్రజానీకం మసలినమాట వాస్తవమే. ఆయన దివంగతుడై రెండు దశాబ్దాలు గడచిపోయినవి. ఈ రెండు దశాబ్దాలకాలంలో మనం కని విని ఎరుగనంత పరివర్తన కలిగింది.

ప్రచండవేగంతో పరిభ్రమించిన ఈ కాలచక్రం దేశకాలాలతోపాటు మన మనోభావాలలోగూడా ఎంతో మార్పును కలిగించింది - గాంధీజీ మనోభావాలు, ఆయన సిద్ధాంతాలూ ఈకాలానికి వర్తించగలవా అనే సంశయం, ఆయన జీవితకాలంలో పుట్టి పెరిగి, ఆయనను అనుసరించిన వారిలోనే కలుగుతూవుండడం చూస్తున్నాము. ఇక క్రొత్త తరపు యువకులకు ఆయనతోగాని, ఆయన తత్త్వంతోగాని పరిచయం లేనేలేదు. వారిదృష్టి ఆయనచూపిన త్రోవవైపు ప్రసరించనేలేదు. మహాఅయితే వారిదృష్టిలో గాంధీజీ చరిత్ర సృష్టించిన ఒక మహాపురుషుడు-అంతే.

మన దేశపు స్థితి ఇలావుండగా, గాంధీ సిద్ధాంతాలను అవగాహనం చేసుకోవలెననీ, అభ్యసించవలెననీ, పరిశోధన చేసి నిగ్గుతేల్చవలెననీ, సంకీర్ణమైన నేటి సమస్యలకు గాంధీ సిద్ధాంతాలను అన్వయించి, చిక్కులను విడదీసి పరిష్కరించ వలెననే ఉత్సాహం విదేశాలలో నానాటికి ఎక్కువవు తున్నది. గాంధీ జన్మించిన భారతదేశానికి, పరిశోధనకై వచ్చిన విదేశీయులకు మనకు గాంధీతత్త్వంఎడల గల నిర్లక్ష్య దృష్టీ, అజ్ఞానమూ ఆశాభంగాన్ని కలిగిస్తున్నవి.

ఈ పరిస్థితుల్లో, భారతప్రభుత్వ విద్యాశాఖవారు ఇప్పించే ఉపన్యాసాలు యువకుల హృదయాలలో జిజ్ఞాసను ప్రేరేపిస్తున్నవి. ఈ ఉపన్యాసాలను భారతీయ విద్యాభవన్ వారు ప్రచురించుటకు పూనుకొని దేశానికి మహోపకారం చేస్తున్నారు. ఈ పుస్తకాలను తెలుగులో వెలువరించవలెననే సంకల్పం, గాంధీసాహిత్యప్రచురణాలయ నిర్వాహకులకు కలి గింది. కోరగానే, భారతప్రభుత్వ విద్యాశాఖవారు తెలుగులో ఈ ఉపన్యాసాలను అనువదించి ప్రచురించుటకు అనుమ తించారు.

1963 వ సంవత్సరంలో పూనా విశ్వవిద్యాలయంలో శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారిగారొసగిన మూడు ఉపన్యా సాల సంపుటి ఇది. రాజగోపాలాచారిగారు గాంధీజీకి, సన్నిహిత సహచరులేకాక, ఆప్తమిత్రులు బంధువులు.

గాంధీతత్త్వం సనాతనమైనదీ, సార్వజనకమైనదీ నని వారు ఈ ఉపన్యాసాలలో నిరూపించారు. గాంధీజీ తనను సత్యాన్వేషకునిగా రూపొందించుకొనుటలో భగవద్గీతకుగల ప్రాధాన్యతను వివరిస్తూ, భగవద్గీతలోవలెనే గాంధీ మూలసూత్రాలున్నూ సార్వకాలీనములైనవని వివరించారు. కేవలం గీతలోమాత్రమే కాక, ఇతర ధార్మికగ్రంథాలు ఆయనపై కలుగజేసిన ప్రభావాన్ని విశదీకరించారు.

ఈ పుస్తకం గాంధీతత్త్వాన్నిగురించిన జిజ్ఞాసను రేకెత్తించడమేగాక, ఆ తత్త్వార్థాన్ని అర్థంచేసుకోవటంలోనూ చాలా తోడ్పడగలదు.

ఈ పుస్తకం అనువాదకులు డాక్టరు అడపా రామకృష్ణారావుగారు బహు భాషాకోవిదులు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆంగ్లభాషాచార్యులు. ఆంధ్ర పాఠక లోకానికి చిరపరిచితులు. గాంధీసాహిత్య ప్రచురణాలయం ప్రచురణలలో ఇది వారి మూడవపుస్తకం. వీరి అనువాదాన్ని గురించి వివరించటం, తినబోయే కూరకు రుచి తెల్పుటయే కాగలదు.

ఈ పుస్తక ముద్రాపకులు, విజయవాడ సర్వోదయ ముద్రణాలయంవారు దీనిని చక్కగా సకాలానికి ముద్రించి ఇచ్చారు.

ఈ పుస్తకం, గాంధీతత్త్వోపన్యాస పరంపరలో రెండవది. అనతికాలంలోనే ఈ శీర్షికలో చాలా పుస్తకాలను ఆంధ్రపాఠకలోకానికి సమర్పించగలమని మనవి.

ఆంధ్రపాఠకలోకం మా యీ కృషిని ఆదరించి ప్రోత్సహించగలదని విశ్వాసము. ఈ పుస్తక ప్రచురణకు కారకులైన వారందరికీ కృతజ్ఞతను వెల్లడిస్తున్నాము.

ఇట్లు,

కోదాటి నారాయణరావు

కార్యదర్శి

సంపాదక సమితి

గాంధీ సాహిత్య ప్రచురణాలయం

హైదరాబాదు_20

22—7—1969

# తొలి నుడి

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారిగారు గాంధీయుగంలో రాజకీయవేత్తగా గణనకెక్కిన పెద్దలు. ఆయన ఇంకా మనమధ్య ఉండడం మన అదృష్టం. గురుతర బాధ్యతలతో కూడిన పదవులను ఆయన సమర్థతతో నిర్వహించి మన్ననల నందుకున్నారు. క్లిష్టకాలంలో భారత రాజ్యాంగ నౌకను సురక్షితంగా నడిపారు. ఆయనబుద్ధి అసిధారవలె అతినిశితమైనది. అమితమైన అనుభవానికీ, సమాచారానికీ, జ్ఞానానికీ ఆయన పెన్నిధి. ఆయన తన అభిప్రాయాలను నిర్భయంగా వెల్లడిస్తారు.

భారత ప్రభుత్వపు విద్యాశాఖవారు గాంధీతత్త్వ ప్రచారాని కొక ప్రణాళికను సిద్ధంచేసి, ఏటేటా పూనా విశ్వవిద్యాలయంలో గాంధీతత్త్వాన్ని గురించి ఉపన్యాసాల నేర్పాటు చేయవలసినదని కోరినప్పుడు. వక్తల నెంచుకోవడంలో ముందుగా మాకు రాజగోపాలాచారిగారి పేరే స్ఫురించింది. అప్పుడాయన అమెరికా సంచారానికి బయలుదేరే ప్రయత్నంలో బహుకార్యమగ్నులై వున్నారు. అయినా ఈ ఉపన్యాసాలను వ్రాతలో సిద్ధం చెయ్యాలన్న నియమాన్నిపాటిస్తూ నవంబరు మాసాంతంలో ఉపన్యసించడానికి ఆయన అంగీకరించారు. గాంధీజీతో చాలాకాలం సన్నిహితంగా వర్తించిన ఈ ప్రముఖ రాజకీయవేత్త ఉపన్యాసాలు వినాలని పూనాలోని విజ్ఞులందరూ ఉత్సాహపడతారని గుర్తించి, ఈ ఉపన్యాసాలను మేము పూనా న్యూ ఇంగ్లీష్ స్కూల్ మైదానంలో ఏర్పాటుచేశాము. ఎనభై మూడేళ్ళ వృద్ధులు, అనుభవజ్ఞులు రాజగోపాలాచారిగారు మూడు రోజులపాటు ప్రతిసాయంకాలం ఉపన్యసించారు. రోజూ దాదాపు నాలుగు వేలమంది పౌరులు శ్రద్ధగా ఆలకించారు. ప్రశ్నలకు సమాధానమివ్వడానికంగీకరించి, అడిగిన వెంటనే ఆయన చక్కగా మనస్సుకెక్కేటట్లు జవాబులిచ్చారు.

ఈ ఉపన్యాసాలు జయప్రదంగా సాగాయి. గాంధీతత్త్వాధ్యయనానికి సంబంధించిన సాహిత్యానికివి మరింత పుష్టిని చేకూర్చుతాయని

నిస్సంకోచంగా చెప్పవచ్చు. ఈ ఉపన్యాసాలను ప్రచురించే హక్కు భారత ప్రభుత్వం చేతులలో వుంది. వీటిని ప్రకటించే అవకాశం లభిస్తే, పూనా విశ్వవిద్యాలయం దానినొక గౌరవంగా భావించి అందు కుద్యమించేది, శ్రీ కే. యం. మున్షీగారి అధ్వర్యాన భారతీయ విద్యాభవన్ సంస్థ భారతీయసభ్యతాసంస్కృతులపై విశిష్ట రచనలను ప్రచురించి పేరుగడించింది. అందువల్ల ఈ ఉపన్యాసాలను భారతీయవిద్యాభవన్ పుస్తకరూపాన ప్రకటిస్తున్నందుకు పూనావిశ్వవిద్యాలయం సంతోషిస్తున్నది. ప్రపంచమంతటా ఈ పుస్తకానికి ఆదరం లభిస్తుందని నాకు పూర్తి నమ్మకముంది.

దత్తో వామన్ పోద్దార్
ఉపాధ్యక్షుడు
పూనా విశ్వవిద్యాలయం

గణేశ్ ఖిండ్
పూనా 7
ఏప్రిల్ 25, 1963

# విషయసూచిక

# గాంధీ తత్త్వము

గాంధీతత్త్వ ప్రచారాని కొక ప్రణాళిక నేర్పరచుకొని పూనా విశ్వవిద్యాలయాధికారులు నన్ను ఉపన్యసించవలసినదని ఆహ్వానించడం నాకు ఘనమైన సత్కారమని నేను భావిస్తున్నాను. ఈ విశ్వవిద్యాలయ స్థాపకులు శ్రీ జయకర్ ఆ తరానికి చెందిన నా స్నేహితులలో ఎన్నదగినవారు. మన దేశానికి స్వాతంత్ర్యాన్నీ, సమున్నత స్థానాన్నీ గడించడానికి మే మెంచుకున్న మార్గాలు భిన్నమైనవి. అయినా జీవితాంతం ఆయన నా పట్ల ఆదరాభిమానాలను చూపారు. ఎన్నడూ ఆయన అభిమానం తగ్గలేదు. మారనూలేదు. ఇక పూనా నగరపు పౌరులలో ప్రథమ గణ్యుడైన లోకమాన్య తిలక్ ఈ శతాబ్దపు ద్వితీయ దశక కాలంలో నాపై చూపిన స్నేహాభిమానాలనుగురించి నేను ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు. నాటినుంచి నాకు గాంధీజీతో సాన్నిహిత్య మేర్పడినమాట వాస్తవమే. అయినా అంతమాత్రంచేత మహారాష్ట్రవాసులలో మహోన్నతుడైన తిలక్ ఘనతనుగాని, భారతదేశప్రతిష్ఠకోసం, స్వాతంత్ర్య సంసిద్ధికోసం ఆయన చేసిన మహత్తర కృషినిగాని నేను గుర్తించకపోలేదు. సమకాలికుణ్ణి గనుక ఆయన ప్రభుత్వ దౌర్జన్యానికీ, రాజకీయ విరోధుల నిందలకూ గురియై ఎన్ని బాధ లనుభవించారో స్వయంగా ఎరుగుదును. అందువల్ల పూనానగరం నా కొక పుణ్యక్షేత్రంవంటిది. అందుకే విశ్వవిద్యాలయంవారి ఆహ్వానం నాకొక గౌరవంగా,

ఆనందకరమైన అవకాశంగా తోచింది. మీ విశ్వవిద్యాలయాధ్యక్షులు డాక్టర్ సుబ్బరాయన్ మా కుటుంబానికి సన్నిహిత మిత్రులు గనుక, ఇక్కడికి వచ్చినప్పుడు ఆయనకు అతిథిగా ఉండడం ఆయన అభిమతమనికూడా నేను సంతోషించాను. కాని దైవనిర్ణయం మరొకవిధంగా వుంది. ఈ ఉపన్యాసాల నివ్వడానికి నేనిక్కడికి రాకముందే ఆయన స్వర్గస్థులయ్యారు. ఆయన అకాలమరణానికి మీతోపాటు నేనుకూడా చాలా చింతిస్తున్నాను.

ఇటీవల నేను అమెరికా, ఇంగ్లండ్ దేశాలకు వెళ్ళి వచ్చిన సంగతి మీకందరికీ తెలిసిందే. గాంధీజీ ఆశయాలను, దుర్మార్గాన్ని ప్రతిఘటించడానికి ఆయన ప్రసాదించిన కార్యాచరణవిధానాన్ని చిత్తశుద్ధితో, భక్తిశ్రద్ధలతో పాటిస్తున్న ఉత్సాహవంతులైన వ్యక్తులను చాలామందిని నేనక్కడ చూశాను. వారిలో కొందరు గాంధీజీ జన్మభూమి మైన మనదేశంలోని గాంధీవాదులకంటె ఎక్కువ ఉత్సాహశ్రద్ధలతో ఆయన సిద్ధాంతాల ననుసరించడంకూడా నేను గమనించాను. సైనికబలం తోడ్పాటుతో సాగుతున్న వర్తమాన మానవసమాజం సరియైన వ్యవస్థ కాదని గుర్తించి, తీవ్రంగా అసంతృప్తి చెందిన ధైర్యవంతులైన వ్యక్తులు, దయామయులైన వ్యక్తులు ప్రపంచంలో అంతటా ఉన్నారు. అందుచేతనే దౌష్ట్యాన్ని ప్రతిఘటించడానికి గాంధీమార్గాన్ని గ్రహించి, దాని ననుసరించడానికే తమ కాలాన్ని, శక్తిని వినియోగిస్తున్న వ్యక్తులుకూడా ప్రపంచంలో అంతటా ఉన్నారు. పశుబలాన్ని ఆత్మబలంతో ఎదిరించాలని ప్రబో

ధించే గాంధీమార్గం వేళ్ళు పాతుకోవడానికి బహుశా ఇతర దేశాలకన్న దుర్బలమై, చుట్టూ శత్రుత్వ వాతావరణం కలిగిన మన దేశం అనుకూలమైనది కాదేమో.

## శాస్త్రం

భారత దేశంలో జనప్రియమైన రచనలు చేయగోరిన వారందరూ గాంధీజీని గురించి వ్రాశారు. ఆ వ్రాసిన వారిలో చాలా సమర్థులైన రచయితలు కొందరున్నారు. ఇప్పుడు నేను చెప్పబోయే మాటలలో నవ్యత ఏమీ ఉండ డానికి అవకాశం లేదు. విసుగు కలిగించేటంత తరచుగా, విపులంగా ఇదివరకే ఈ విషయాన్ని గురించి పలువురు వ్రాశారు. అంతేకాదు. గాంధీజీ బోధను గురించి ప్రస్తా వించడానికి ఇంతకంటె ప్రతికూలమైన కాలం మరొకటి ఉండదు. ఎందుకంటే, ప్రస్తుతం మన దేశవాసులందరూ ఆగ్రహావేశపరులై, మానసికంగా యుద్ధోన్మాద వశులై ఉన్నారు. వారిప్పుడు తుపాకులను, బాంబులను తలచు కుంటున్నారు.

అయినా మన దేశం ముందుగా ఊహించి సంసిద్ధం కాని ప్రమాదాన్ని ఎదుర్కొంటున్న ఈ సమయంలో, ఈ దేశానికి ఇప్పటి స్వాతంత్ర్య ప్రతిపత్తిని సాధించిన వ్యక్తిని మనం స్మరించడం సమంజసం కాకపోదు. మన ఆగ్రహం నేడు అవధులు దాటవచ్చు. యుద్ధావేశంలో మనం తొందర పడి తిరిగి దిద్దుకోవడానికి వీలులేని తప్పులు చేసే ప్రమాద మున్నది. ఏమైనా గాంధీజీ తన యావజ్జీవితం బోధించడానికి

శ్రమించిన అంశాలను కొంతసేపు స్మరించడంవలన లాభమే కాని నష్టమేమీ ఉండదు.

యునెస్కో సంస్థకోసం గాంధీజీ జీవితాన్ని గురించీ, బోధలనుగురించీ ఆయన మాటలతోనే కూర్చిన గ్రంథానికి డాక్టర్ రాధాకృష్ణన్ పీఠిక వ్రాశారు. ఆ పీఠికలో ఆయన "ప్రపంచంలో ఎల్లప్పుడూ ప్రబుద్ధ మనస్కులైన వ్యక్తులు కొద్దిమంది ఉంటారు. వారి పరిచయం అమూల్యమైన అనుభవం" అని ప్లేటో అన్న మాటలను ఉదాహరించారు. ఈ అమూల్యానుభవాన్ని మరి కొందరితోపాటు నేనుకూడా పొందాను. గాంధీజీ యావజ్జీవితం నామీద నమ్మకకలిగి, నన్ను ప్రేమాభిమానాలతో ఆదరించిన సంగతి నేను సదా కృతజ్ఞతతో స్మరిస్తాను.

కాని ఈ విశ్వవిద్యాలయాధికారులు గాంధీజీని గురించి వరుసగా కొన్ని ఉపన్యాసాల నివ్వవలసినదని కోరి నప్పుడు నేను వెనుకాడవలసివచ్చింది. బొగ్గుగనిలో పనిచేసే కార్మికుణ్ణి పిలిచి బొగ్గును గురించి మూడు ఉపన్యాసాల నివ్వవలసినదని మీ రడిగితే అతడేమి చేయగలడు ? నా స్థితి కూడా అచ్చంగా ఆ విధంగానే ఉంది. నేను ముప్ఫయి అయిదేళ్ళపాటు గాంధీజీతో కలిసి కృషి చేశాను. ఆయన పోయిన తరువాతకూడా ఆయనతో కలిసి జీవిస్తూనేవున్నాను. పగలు తలచుకోవడమేకాదు, రాత్రిపూట కలలలో ఆయనా, నేనూ కలిసి మాట్లాడుకోవడంకూడా జరుగుతూనేవుంది. అయినా బొగ్గునుగురించి ఉపన్యసించవలసినదని అడిగితే సంకోచించే మన కల్పిత కార్మిక మిత్రుడివలెనే నేనుకూడా

గాంధీతత్త్వాన్ని గురించి ప్రస్తావించాలంటే సందిగ్ధావస్థలో ఉన్నాను.

"గాంధీవాదమంటూ ప్రత్యేకంగా ఏదీ లేదు. ఒక నూతన తత్త్వాన్ని గాని, తెగను గాని నేను స్థాపించడం లేదు. ఏదైనా నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించానని నేనెన్నడూ అనలేదు. ప్రపంచానికి నేను క్రొత్తగా బోధించే దేమీ లేదు. సత్యమూ, అహింసా కులగిరులవలె ప్రాచీన మైనవి" అని గాంధీజీ అన్నాడు. ఏవిధమైన అస్పష్టతకు అవకాశం లేని గాంధీజీ మాటలవి. అయినప్పుడు ఏదో ఒక విధంగా ఒక క్షణకాలం నేను గాంధీజీని ప్రత్యక్షం చేసుకొని, పూనా విశ్వవిద్యాలయం వారు నన్ను తన బోధలను గురించి ఉపన్యసించ వలసినదిగా కోరారనీ, ఏ విధమైన హెచ్చుతగ్గులు లేకుండా భగవద్గీత సందేశాన్నే గాంధీజీ బోధించారని నేను నా ఉపన్యాసంలో చెపుతాననీ ఆయనతో అంటాననుకోండి. తన బోధను నేను ఈ విధంగా వివరించ దలచినందుకు ఆయన నిస్సందేహంగా హర్షించి, నా ప్రయత్నాన్ని ఆమోదిస్తాడు. తానొక నూతన ధర్మాన్ని కనిపెట్టలేదని, భగవద్గీత ప్రతిపాదించిన ధర్మాన్నే తాను బోధించానని అందరూ స్పష్టంగా గుర్తించాలని గాంధీజీ ఎప్పుడూ కోరేవాడు. అందుచేత ఈనాటి స్థితిగతుల కన్వయించుకోవడానికి వీలుగా భగవద్గీతా సందేశ సారాన్ని నాకర్థమైనట్లు మీకు చెపుతాను. తన బోధగా గ్రహించ వలసినదని గాంధీజీ కోరిన ధర్మాన్ని వివరించడానికిదే శ్రేష్ఠమైన మార్గ మనుకుంటాను.

సనాతన ధర్మాన్ని లోకానికి బోధించిన దార్శనికులు మతాన్ని శాస్త్రీయ దృక్పథంతో చూశారు. మతమంటే సత్యాన్వేషణ అని వారి అభిప్రాయం. అనుల్లంఘ్యమైన సిద్ధాంతాలే మతమని వారెన్నడూ అనుకోలేదు. అందుకే చిరకాలంగా విభిన్న సిద్ధాంతాలు తలయెత్తినా, వారు వాటిని సహనశీలంతో చూశారు. మన మెన్నడైనా మతం ఆత్మకు సంబంధించిన శాస్త్రమనే భావిస్తున్నాము గాని, కేవలం కొన్ని సిద్ధాంతాల పట్టికయే మతమని అనుకోవడంలేదు. అందువల్ల జీవితరహస్యాన్ని గుర్తించడానికి విభిన్నమార్గాలలో జరిగే ప్రయత్నాలన్నిటినీ హిందూమతం సహించడమే కాదు, ఆ మార్గాలు చిత్తశుద్ధితో రూపొందినవైతే, వాటిని గౌరవభావంతో చూడాలనికూడా చెప్తున్నది. వేదాంతాన్ని ఆచార్యపురుషులు భిన్నభిన్నంగా ప్రతిపాదించారు. అయినా ఆ విభిన్న సిద్ధాంతాలన్నిటినీ గౌరవభావంతోనే చూడడం జరుగుతున్నది. మానవప్రవర్తనకు సంబంధించినంతవరకు హిందూమతంలోని శాఖలన్నీ ఒకే ధర్మాన్ని బోధిస్తున్నవి. అవి పేర్కొనే నైతిక ధర్మాన్నే భగవద్గీత స్పష్టంగా వివరిస్తున్నది. ఆ ధర్మం మతశాఖలతో నిమిత్తం లేకుండా మంచిగా బ్రతుకగోరే మనుష్యులందరికీ వర్తిస్తుంది. అది కాలానికి కట్టుబడ్డ ధర్మం కాదు గనుక, ప్రాతబడడమనే ప్రసక్తి లేదు. భగవద్గీత బోధించే జీవిత-విధానం వర్తమాన ప్రపంచపు అవసరాలకుకూడా చక్కగా వర్తిస్తుంది.

ప్రాపంచిక కర్మలను కొనసాగిస్తూనే వుండవలసినదని భగవద్గీత బోధిస్తున్నది. కర్మను మానుకొమ్మని బోధించ లేదు. సమాజంలో మన స్థానాన్నిబట్టిగాని, ప్రత్యేకంగా మన కప్పగించడంవల్ల గాని మన వంతుకు వచ్చిన పనులను మనం మన విధిగా భావించాలి. వాటిని మనం స్వార్థరహితంగా, ఫలాపేక్ష లేకుండా నిర్వర్తించాలి. అయినా స్వార్థంతో పనిచేసేవాడివలెనే మనంకూడా ఎంతో శ్రద్ధతో, కౌశలంతో వాటిని చెయ్యాలి. ఈ విధంగా ప్రాపంచిక కార్యకలాపాలలో పాల్గొంటూనే దైవాని కంకితమైన జీవితాన్ని గడపడాని కవకాశమిచ్చే మానసికస్థితినే యోగమంటారు. ఈ విధంగా జీవించడానికి మనిషికి జ్ఞానమూ, వినయమూ, భక్తీ కావాలి.

స్వార్థం కోసమైనప్పుడు ఎంతో మెలకువతో, కష్టించి పనిచెయ్యడం సులభమే. కాని మనం చేసే పనివల్ల వ్యక్తిగతంగా మనకు గాక మొత్తం సమాజానికి లాభం కలిగే టప్పుడుకూడా అత్యంత శ్రద్ధతో, కౌశలంతో మనం కర్మను నిర్వర్తించాలని గీత బోధిస్తున్నది. పూర్తిగా ప్రాపంచిక కృత్యాలలోనే నిమగ్నులమైనప్పుడుకూడా స్వార్థరహితమైన తటస్థభావాన్ని మనం అలవరచుకోవాలి. ప్రపంచంలోని ప్రతి ప్రాణిలోనూ ఉన్నట్లే, తనలోకూడా పరమాత్ముడు వసించివున్నాడని సత్పురుషుడు సదా జ్ఞాపకముంచుకోవాలి. కామ, క్రోధ, మోహాదులవల్ల కళంకితం కాకుండా తన మనస్సు పవిత్రంగా ఉండడానికి అతడెప్పుడూ ప్రార్థిస్తూ

వుంటాడు. సమాజ రక్షణకూ, సంక్షేమానికీ అవసరమైన ఏ పనినైనా అతడు సత్కార్యంగా భావిస్తాడు.

ధైర్య స్థైర్య సంపన్నుడైన సత్పురుషుడు తన కర్మను క్రమబద్ధంగా ఆచరిస్తాడు. అతడాహారవిహారాలలో మితాన్ని పాటిస్తాడు. కష్టాలు తటస్థించినప్పుడు భయవిహ్వలుడు కాడు. ఫలాన్ని దైవానికే వదలి కర్మను కొనసాగిస్తాడు గనుక తన కృషి ఫలించినా, ఫలించకపోయినా అతడు ధైర్య స్థైర్యాలను విడనాడడు.

విజ్ఞాన శాస్త్రాన్ని గురించి, మతాన్ని గురించి, రాజనీతిని గురించి మన విశ్వాసాలు పరస్పరం సామరస్యంతో ఉండడం అవసరం. సృష్ట్యాదిలో జడంగా వున్న పదార్థంలోని శక్తి క్రమంగా జాగరితం కావడం ద్వారా ఈ విశ్వమేర్పడిందని ఆధునిక విజ్ఞానశాస్త్రం చెపుతున్నది. విజ్ఞాన శాస్త్రం వెల్లడించిన ఈ అంశం మన వేదాంత బోధకు పూర్తిగా అనుగుణంగా ఉన్నది. ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించే ఈ సుందర విశ్వస్వరూపాన్ని గురించి విజ్ఞానశాస్త్ర సిద్ధాంతానికి వేదాంతం పూర్తిగా అనుగుణంగా ఉన్నట్లే, భగవద్గీత నిర్దేశించే జీవిత విధానం పౌర జీవితాన్ని గురించి నేటి అభ్యుదయ భావాలకు పూర్తిగా అనుగుణంగా ఉన్నది.

స్థిరమైన ఆర్థిక వ్యవస్థకు స్వార్థపు ప్రేరణ కన్న సహకారంపై ఆధారపడిన సామూహిక జీవితం వాంఛనీయమని ఈనాటి అర్థశాస్త్రజ్ఞులంటున్నారు. ఇట్టి సాంఘిక

వ్యవస్థ ప్రభుత్వానికెంతటి శక్తి వున్నా, కేవలం ప్రభుత్వ శాసనం ద్వారా సాధించడానికి వీలుకాదు. ప్రభుత్వ శాసనానికి అంతరంగం కూడా చేయూత నివ్వాలి. అంతరంగం శాసించినట్లాచరించే సంస్కృతి వ్యాప్తిలో వుండాలి. ఇటువంటి సంస్కృతి తోడ్పడితేనే తప్ప, కేవల కార్యక్రమ ప్రణాళికలవల్ల బలాత్కారం, వంచన, దుర్నీతి వ్యాపించడమే గాని కార్యసిద్ధి కాదు.

ప్రతివ్యక్తీ తనశక్తిమేరకు శ్రమించాలనీ, ప్రతివ్యక్తికీ అవసరాలకు చాలినంత లభించాలనీ చాటే వేదాంత సంస్కృతి సామూహిక జీవిత వ్యవస్థకు పూర్తిగా అనుకూలంగా వుంది వ్యక్తులకు ప్రత్యేకంగానూ, సాముదాయికంగానూ కేటాయించే పని మొత్తం సమాజ క్షేమాన్ని దృష్టిలో ఉంచుకొని నిర్ణయించాలి. సమాజ సంక్షేమంకోసం వ్యక్తి జీవితం సమాజం అధీనంలో వుండాలని మనంభావిస్తే, అందుకు మనం కేవలం రక్షక భటులమీదా, గూఢచారుల మీదా ఆధారపడవలసిరాకూడదు. అంతఃకరణమే కర్తవ్యాన్ని శాసించేటట్లు మనం ఆధ్యాత్మిక జీవితాన్నీ, సంస్కృతినీ అలవరచుకోవాలి. అప్పుడు విధిని నిర్వహించడమే సంతోషదాయకం కాగలదు. జీవితంలో న్యాయసమ్మతమైన ఆర్థికవ్యవస్థకు ఆధ్యాత్మికంగానూ, సాంస్కృతికంగానూ బలాన్ని చేకూర్చే ధర్మోపదేశం మనకు భగవద్గీతలో లభిస్తుంది.

భారతీయ సంస్కృతికి వేదాంతతత్త్వమే మూలం. ఇది నేటికీ నిలిచేవుంది. పూర్తిగా అదృశ్యంకాలేదు. నశించి

పోతేము. ధనికులు, పేదలు, భోగలాలసులు, శ్రమజీవులు, హిందువులు, అన్యమతస్థులు అనే విచక్షణలేకుండా, భారత దేశవాసులందరికీ భగవద్గీత బోధించే జీవిత విధానం సమ్మతమే. వేదాంతతత్త్వం పండితులకే కాదు, పామరులకు కూడా నచ్చుతుంది.

సొంత లాభానికి గాక సమాజ కల్యాణంకోసం కర్మనాచరించడమే గీత బోధించే జీవిత విధానం. మనవంతుకు వచ్చిన పని యేదైనాసరే, అది గౌరవప్రదమైనదేనని, పవిత్రమైనదేనని గీత స్పష్టంగా చెపుతుంది. నిజానికి భగవద్గీత ధార్మిక పరిభాషలో సామ్యవాద సిద్ధాంతాన్ని బోధిస్తుంది. చిత్తశుద్ధితో చేసే ఏ పనియైనా దైవారాధనయేనని గీత చాటుతుంది.

ఈ సత్యాన్నే గాంధీజీ బోధించాడు. దీనిని మనకు స్పష్టం చేయడానికే ఆయన యావజ్జీవితం శ్రమించాడు. గీతాబోధ అని నేను వివరించిన జీవిత విధానాన్ని మన మనుసరించడానికి ప్రయత్నిస్తే, అప్పుడు మనం నిజంగా గాంధీమార్గాన్ని అవలంబించినవారమవుతాము. దౌష్ట్యాన్ని ప్రతిఘటించవలసినదని గీత బోధిస్తుంది. అది మన విధి అని గాంధీజీ అన్నాడు. కొంతకాలంపాటు శరీర పరిశ్రమకు సంబంధించిన కఠోర శిక్షణ పొందితేనేగాని సైనికుడు తానెదుర్కొనవలసిన బాధ్యతలకు తట్టుకోలేనట్లే, గీతాబోధ ననుసరించి కర్మ నాచరించడానికి కనీసం చిత్తశుద్ధితో, యావచ్ఛక్తితో ప్రయత్నిస్తేనేగాని గాంధీజీ ప్రసాదించిన కార్యాచరణపద్ధతి నెవ్వరూ జయప్రదంగా పాటించలేరు.

ఇతరమతాలూ, ఆధునిక భావనా గాంధీజీపై చూపిన ప్రభావాన్ని గురించి తరువాత చెపుతాను. అయితే భగవద్గీతయే గాంధీజీ శాస్త్రమని, కర్మ, అనాసక్తి, ప్రార్థన, శరణాగతి అనే గీత ఆదేశాల ననుసరిస్తూనే గాంధీజీ కృషిచేశాడని ఘంటాపథంగా చెప్పవచ్చు.

## సత్యం

గాంధీజీ పోయినప్పుడు అందరూ శోకంలో మునిగివున్న సందర్భంలో సర్దార్ వల్లభభాయి పటేల్ నాతో ఒక మాట అన్నాడు. దుఃఖావేశంలో అన్నమాటగాని, లోతుగా ఆలోచించి అన్నమాట కాదది. పాకిస్తాన్‌కు యాభై కోట్ల రూపాయల నిచ్చితీరాలని 1947 శీతకాలంలో గాంధీజీ పట్టుబట్టడంచేతనే ఆయన హత్య జరిగిందని సర్దార్ పటేల్ అన్నాడు. మన దేశంనుంచి బ్రిటిష్ ప్రభుత్వం తొలగిపోవడానికి ఒడంబడిక కుదుర్చుకున్నప్పుడు పాకిస్తాన్ ప్రత్యేక దేశంగా ఏర్పడింది. రెండు దేశాలమధ్య ఆస్తులు, అప్పులు పంచడంలో, క్రొత్తగా ఏర్పడుతున్న పాకిస్తాన్‌కు నగదు నిలువగా యాభై కోట్ల రూపాయల నివ్వాలని నిర్ణయం జరిగింది.

ఒడంబడికలోని ఈ అంశాన్ని కార్యరూపంలోనికి తేకముందే, పాకిస్తాన్ మనతో యుద్ధానికి తలపడి విషమ పరిస్థితిని కల్పించింది. ఐనప్పుడీ సొమ్మును మనదేశం పాకిస్తాన్‌కెందు కివ్వాలని ఒకవాదం తలయెత్తింది. అప్పుడు నేను బెంగాల్ రాష్ట్రానికి గవర్నరుగా ఉన్నాను. "ఇప్పుడీ సొమ్మును మనమిస్తే, దీనిని కూడా మనమీద యుద్ధానికే

ఖర్చుపెడుతుం"దని సర్దార్ పటేల్ అన్నాడు. "కాని మనం ఈ సొమ్ము నిస్తామని చిత్తశుద్ధితో ఒప్పుకున్నాము. ఆ ఒడంబడిక ననుసరించి స్వాతంత్ర్యాన్ని పొందాము. కనుక మనం పర్యవసానంతో నిమిత్తం లేకుండా మన వాగ్దానాన్ని చెల్లించా"లని గాంధీజీ అన్నాడు. గాంధీజీ ఇచ్ఛ ప్రకారం ఆ సొమ్మును మనం పాకిస్తాన్ కివ్వడం జరిగింది. అందుచేతనే, 1948 జనవరి 30 నాడు గాంధీజీ హత్య జరిగినప్పుడు, మనతో అక్రమంగా యుద్ధం సాగిస్తున్న పాకిస్తాన్ ప్రభుత్వానికి అంత పెద్ద మొత్తం ఇవ్వవలసిందని సలహా ఇవ్వడంవల్లనే గాంధీజీపట్ల హిందువుల క్రాగ్రహావేశాలు పొడసూపి, ఆయన హత్యకు వారు కుట్రపన్నడం తటస్థించిందని సర్దార్ వల్లభభాయి పటేల్ భావించాడు. అప్పటి పరిస్థితులలో మనం యాభైకోట్ల రూపాయల నిచ్చి శత్రువుకు సహాయంచేయడం క్షమింపరాని అవివేక మనిపించింది. మహారాష్ట్రంలో గాంధీజీని వ్యతిరేకించే తీవ్రవాదులు కొద్దిమంది గాంధీజీ మనదేశానికి చేస్తున్న అపకారాలలో ఈచర్య ఏమాత్రం సహింపరానిదని భావించి, మరొక దారి లేదు కాబట్టి వివేకహీనుడైన ఈ సత్పురుషుణ్ణి హత్య చేయడమే దేశ క్షేమానికి ఏకైక మార్గమని నిశ్చయించారు. గాంధీజీ పలుకుబడి అనన్యమైనది గనుక, ప్రజలు మూఢభక్తితో ఆయన ఆదేశాన్ని పాటిస్తారు గనుక ఆయనను హత్యచేయడంకన్న మరొక మార్గమేదీ లేదని కుట్రదారులనుకున్నారని సర్దార్ పటేల్ అభిప్రాయం.

"వాగ్దానం ప్రకారం మనం డబ్బు చెల్లిద్దామనుగాని, ఇప్పుడు కాదు" అని సర్దార్ పటేల్ నచ్చజెప్పడానికి ప్రయత్నించాడు. కాని ఏమీ ప్రయోజనం లేకపోయింది. "మనం ఇప్పుడే ఆ డబ్బు నిస్తామని వాగ్దానం చేశాము. కనుక ఇప్పుడే ఇచ్చితీరాలి" అని గాంధీజీ అన్నాడు.

సర్దార్ పటేల్ ఊహ సరియైనది కావచ్చు, కాకపోవచ్చు. మనం యాభై కోట్ల రూపాయలు చెల్లించడమే గాంధీజీ హత్యకు కారణం కావచ్చు. లేక అందుకు మరేదైనా పూర్వపు పగ కారణమై యుండవచ్చు. ఏమైనా, చిత్తశుద్ధితో చేసిన వాగ్దానాన్ని చెల్లించడమే ఎప్పటికైనా దేశానికి లాభదాయకమని గాంధీజీ అభిప్రాయమనిమాత్రం ముఖ్యంగా గమనించాలి. దేశవిభజనకు సమ్మతించడం వల్ల మనకు స్వాతంత్ర్యం సిద్ధించింది. పాకిస్తాన్ దేశ మేర్పడిన మొదట్లో యాభైకోట్ల రూపాయలను మనం దానికివ్వడం ఆ ఒడంబడికలో ముఖ్యాంశం. కనుక మనం మన వాగ్దానాన్ని అవశ్యం చెల్లించాలి. అంతేకాని ఆడినమాట తప్పామనే కళంకంతో మన స్వతంత్ర జీవనం ప్రారంభం కాకూడదని గాంధీజీ పట్టుబట్టాడు. ఒక జాతి పురోభివృద్ధి కేవలం డబ్బుమీద, ఐహికమైన ధ్యేయాలమీదనే ఆధారపడదు. దేశపు దీర్ఘకాలిక యోగక్షేమాలు నైతికస్థాయితో ముడిపడి ఉంటాయి. యాభై కోట్లు మన మివ్వకపోతే 1947 లోనే భారతదేశం నైతిక శక్తిని కోల్పోయి ఉండేది, అప్పుడు గాంధీజీ ఒక హిందూయువకుని రివాల్వర్ కాల్పుల వల్ల గాక, నిస్పృహవల్ల గుండెపగిలి మరణించి ఉండేవాడు.

మనం యాభైకోట్లు నిచ్చివేయడంవల్ల మన నైతిక స్థాయి కేవలం నిలబడడమే కాదు, అది యింకా పెరిగింది.

పాకిస్తాన్‌కు చెల్లించవలసివచ్చిన ఈ మొత్తాన్ని గురించి చెలరేగిన వాదోపవాదాలను తలచుకుంటే, రాము డరణ్య వాసానికి వెళ్ళబోయేటప్పుడు జరిగిన చర్చ జ్ఞప్తికి వస్తుంది. రాజాజ్ఞను ధిక్కరించడానికి ఎన్ని కారణాలనైనా లక్ష్మణుడు పేర్కొన్నాడు. కాని రాముడు సమ్మతించలేదు. ఔచిత్యానౌచిత్యాలతో నిమిత్తం లేదని, దశరథుడు చేసిన వాగ్దానాన్ని చెల్లించి, తండ్రి ప్రతిష్ఠను కాపాడవల సినదేనని రాముడు ఖండితంగా చెప్పాడు. హిందూజాతి ఎన్నో ఔన్నత్యపతనాలకు గురి అయింది. అయినా వాల్మీకి మహర్షి రామకథాగానం చేసిననాటి ఆదర్శాలు మాత్రం నేటికీ శిరోధార్యాలై నిలిచియున్నవి. స్వచ్ఛందంగా రాము డయోధ్యను వదలి అడవులకు వెళ్ళడం రాజనీతిలో ప్రస్తుతకాలానికికూడా వర్తించే ముఖ్య పాఠమని గాంధీజీ అభిప్రాయం. మతం వేరు, రాజకీయ వ్యవహారాలు వేరు అని విడదీసే సిద్ధాంతాన్ని గాంధీజీ ఎన్నడూ ఆమోదించ లేదు. జీవితంలోని వివిధాంశాల ఏకత్వాన్నే గాంధీజీ సిద్ధాంతంగా పాటించాడు. "నా రాజకీయాలకూ, ఇతర కార్యకలాపాలకూ ప్రాతిపదిక నా మతమే. అంతే కాదు. మతధర్మాన్ని పాటించే వ్యక్తి చేసే అన్నిపనులకూ ఆధారం మతమేనని నే నంటాను. ఈనాడు నేను రాజకీయ కార్య కలాపాలలో పాల్గొంటున్నానంటే, ఎంత ప్రయత్నించినా తప్పించుకోవడానికి వీలులేకుండా కొండచిలువలాగ రాజకీ

యాలు మనలను చుట్టుకుని వుండడమే అందుకు కారణం. నే నీ కొండ చిలువతో పోరాడదలుచుకున్నాను. రాజకీయాలలోనికి మతాన్ని ప్రవేశపెట్టడానికి యత్నిస్తున్నాను". అని గాంధీజీ తన ఆశయాన్ని వ్యక్తం చేశాడు. మతమంటే శాస్త్రవిహితమైన కర్మకాండ అనిగాని, ఆచారాలూ, సంప్రదాయాలూ అనిగాని గాంధీజీ అభిప్రాయం కాదు. ఆయన మాటలలోనే చెప్పాలంటే, "సృష్టికర్త సాన్నిధ్యానికి మనలను తీసుకువెళ్ళే" మతాలన్నిటిలోనూ సారభూతమైవున్న ధర్మమే మతమని ఆయన అభిప్రాయం.

"మతం లేకుండా నే నొక్క క్షణమైనా జీవించలే" నని గాంధీజీ అన్నాడు. "నా రాజకీయ కార్యకలాపాలు కూడా మతంతో ముడివేసుకున్నవని నా రాజకీయమిత్రులు చాలామంది నన్ను గురించి నిస్పృహ చెందుతున్నారు. వారనేది నిజమే. నా రాజకీయాలకూ, ఇతర కార్యకలాపాలకూ ప్రాతిపదిక నా మతమే" అని ఎట్టి అస్పష్టతకు తావు లేకుండా గాంధీజీ రాజకీయాలలోనికి మతాన్ని ప్రవేశపెట్టడానికి అభ్యంతరం చెప్పే రాజకీయ మిత్రులకు చెప్పాడు. "సమాజ మంతటితోనూ తాదాత్మ్యం చెందితేనేగాని నేను ధార్మికజీవనం గడపలేను. రాజకీయాలలో పాల్గొంటేనేగాని సమాజంతో తాదాత్మ్యం చెందలేను" అని ఆయన తన రాజకీయ కార్యకలాపాలను నిరసిస్తూ, కేవలం ధార్మిక జీవనమే గడుపవలసినదని సలహానిచ్చిన ప్రభుత్వంతో చెప్పాడు. "నేను రూపొందించుకున్న జీవితవిధానంలో సాధ

నమూ, లక్ష్యమూ పరస్పరం స్థానాలు మార్చుకోవడానికి వీలిచ్చే పదాలు. సాధనాన్ని గురించి మనం శ్రద్ధ వహిస్తే, ఏనాటికైనా లక్ష్యాన్ని పొందితీరుతాము" అని గాంధీజీ ఉద్ఘాటించాడు. మన ఎంచుకునే సాధనం మతధర్మానికి అనుకూలమైనదిగా ఉండితీరాలని ఆయన నిశ్చితాభిప్రాయం. "సాధనాన్ని గురించి శ్రద్ధ వహించండి. అహింసాయుతమైన, శుద్ధమైన సాధనాన్ని గ్రహించండి. 'రామ' అంటే శక్తి - విరోధి విధిగా గుర్తించే నైతిక శక్తి. సాధనాన్ని గురించి శ్రద్ధ వహించి, నైతికశక్తి నలవరచుకోనండి. అప్పుడు లక్ష్యం తనంతట తానే సిద్ధిస్తుంది" అని గాంధీజీ బోధించాడు.

గాంధీజీ భక్తిపరుడైన హిందూమతస్థుడనీ, ఐనా మతాన్ని మూఢంగా అనుసరించక, తన బుద్ధికి యుక్తమని తోచిన సంప్రదాయాలనే ఆయన పాటించేవాడనీ, అన్ని మతాలూ సత్యసమన్వితమైనవని, అనుసరించే వ్యక్తులకు సంబంధించినంతవరకు అవి సత్యమైనవేనని ఆయన విశ్వసించేవాడనీ, ఆయన రూపొందించుకున్న తత్త్వంలో సత్యానికీ, అహింసకూ అత్యున్నతస్థానం లభించిందనీ, భగవద్గీత బోధించిన అనాసక్తియోగానికి ఆయన ప్రాముఖ్య మిచ్చాడనీ అందరికీ విదితమే. ఇదంతా లోకానికి స్పష్టంగా తెలిసిందే. నచ్చజెప్పడంద్వారా ఇతరులను తన దారికి తీసుకురావడానికి గాంధీజీ సదా యత్నించిన సంగతిమాత్రం, ప్రత్యేకించి గమనించవలసివుంది. దక్షిణాఫ్రికా ప్రభుత్వం,

బీహార్ రాష్ట్రంలోని తేయాకు తోటల యజమానులు, అహమదాబాద్ మిల్లు యజమానులు, భారతదేశాన్ని శాసిస్తున్న బ్రిటిష్ ప్రభుత్వం - ఎదుటివారెవరైనా కానివ్వండి, వారిని తన విశ్వాసాల కనుకూలంగా మార్చడానికి గాంధీజీ యావజ్జీవితం ప్రయత్నించాడు. అహింసా విధానమే అత్యంత ఫలప్రదమైనదని ఆయన విశ్వసించాడు. తాను క్లేశాన్ని భరిస్తూ ఎదుటివ్యక్తికి నచ్చజెప్పే ప్రయత్నాన్ని ఆయన అహింసావిధాన మన్నాడు. దౌర్జన్య చర్యలు, సాయుధ విప్లవం వంటి బలాత్కార మార్గాలకు బదులు లక్ష్యసిద్ధికి అహింసా విధానాన్ని పూర్తిగా అవలంబించాలని ఆయన నమ్మకం. తన మార్గం హింసాత్మక మార్గానికి బదులుగా అక్కరకురావడమే కాదు, అది అంతకంటె శ్రేష్ఠమైనదని ఆయన దృఢంగా విశ్వసించాడు.

మానవ ప్రవృత్తిని గురించి రెండు విభిన్న దృక్పథాలు వ్యాప్తిలోవున్నవి. సునిశ్చితాభిప్రాయా లున్న వ్యక్తులందరూ ఈ రెండింటిలో ఏదో ఒక దానిని మొండిగా సమర్థిస్తారు. ఒక్కొక్కప్పుడు ఒకేవ్యక్తి ఈ విభిన్నదృక్పథాలను విశ్వసించడంకూడా కనిపిస్తుంది. చిరుతపులి తన మచ్చలను మాపుకోనట్లే మనిషి తన నడవడిని ఎన్నటికీ మార్చుకోలేడని ఒకవర్గంవారి విశ్వాసం. రెండవవర్గంవారు ప్రతివ్యక్తి సహజంగా మంచివాడేననీ, నచ్చజెప్పితే మాటవింటాడనీ, స్వార్థరహితమైన ప్రేమతో, త్యాగబుద్ధితో అతనితో వ్యవహరిస్తే, అతనిని దుర్మార్గంనుంచి సన్మార్గానికి, మూర్ఖత్వం

నుంచి సత్ప్రవర్తనకు మార్చడానికి సాధ్యమవుతుందని విశ్వసిస్తారు. గాంధీజీ ఈ రెండవ వర్గంవారి విశ్వాసాన్ని మనసార నమ్మాడు. మనిషి నడవడిని మార్చవచ్చుననే విశ్వాసం ఆయన బోధలో, ఆచరణలో అడుగడుగున కనిపిస్తుంది. ఆయన ఏది బోధించినా, నిజజీవితంలో ముందుగా ఆచరించి సాధించిన తరువాతనే బోధించేవాడు.

ఏదైనా నిర్దిష్టమైన అన్యాయాన్ని ప్రతిఘటించడానికి సత్యాగ్రహం చేయడం సులభమే, కాని స్వరాజ్యంకోసం సత్యాగ్రహాని కుద్యమించడం కొంత క్లిష్టమైనదని గాంధీజీ చక్కగా గుర్తించాడు. స్వరాజ్య సాధనకోసం సత్యాగ్రహం సాగించడంలో స్వపరిపాలనకు కావలసిన శక్తిని సమకూర్చుకోవలసిన అవసరం కూడా ఉన్నది. అప్పటికి మనకు స్వపరిపాలన కవసరమైన శక్తి లేదని ఆయన గ్రహించాడు. అయితే సామూహిక సత్యాగ్రహోద్యమంలో అహింసాయుత కార్యక్రమాన్ని విజయవంతంగా సాధించే ప్రయత్నమే స్వపరిపాలన శక్తి నలవరచే శిక్షణాలయం వంటిదని, దానిలో విజయం చేకూరితే స్వపరిపాలనకు కావలసిన దక్షత కూడా దానితోపాటు సిద్ధించి తీరుతుందని ఆయన నమ్మకం.

బయటికి కనిపించే తీరుకన్న వాస్తవ స్థితికే గాంధీజీ ఎక్కువ ప్రాముఖ్యాన్నిచ్చేవాడు. బ్రిటన్ అధికారంనుంచి మనం విడిపోవడంకన్న, రాజ్యాంగ చట్టాన్ని రూపొందించుకోవడంకన్న ప్రజలలో స్వాతంత్ర్యాన్ని గడించగల శక్తి వుండడం ముఖ్యమని ఆయన అభిప్రాయం. గాంధీజీని గురించి,

స్వాతంత్ర్యోద్యమంలో ఆయన చర్యలను గురించి వ్రాసిన విద్వాంసులు చాలా మంది ఆయన ప్రదర్శించిన ఈ వైఖరిని స్పష్టంగా గుర్తించలేదు. కొందరు విమర్శకులపార్థం చేసుకున్నారు. బ్రిటిష్ ప్రభుత్వం ముఖ్యమని భావించిన ఏ అంశాన్ని గురించియైనా ఆ ప్రభుత్వాన్ని ప్రతిఘటించి మన పంతం నెగ్గించుకోగల శక్తియే స్వరాజ్యమని గాంధీజీ విశ్వాసం. "బలాధిక్యంగల ప్రభుత్వాన్ని నా ఇచ్ఛప్రకారం ప్రవర్తించేటట్లు నేను నిర్బంధించగలిగితే చాలు. మేము విడిపోకపోయినా, అప్పుడు నేను స్వతంత్రుడి నన్నమాటే" అని గాంధీజీ అన్నాడు. అందుకే ఖిలాఫతును గురించి, పంజాబును గురించి మొదట వ్రాసిన తీర్మానంలో ఆయన స్వరాజ్య ప్రసక్తి తీసుకురాలేదు. దానిలో ఖిలాఫతుతో పాటు స్వరాజ్యాన్ని గురించి కూడా చేర్చవలసినదని అనుచరులడిగితే, తన తత్త్వానుసారం అది తీర్మానంలో ఎటూ అంతర్లీనమై వున్నది గనుక, ఆయన అందుకు వెంటనే సమ్మతించాడు.

గాంధీజీ 1921 శీతకాలంలో జరిగిన ఒక సమావేశంలో పాల్గొనలేదు. ఆయన ఆ సమావేశాన్ని చిన్నచూపు చూశాడు. ఆ సందర్భంలో గాంధీజీ వైఖరిని గురించి ఎన్నో ఊహాపోహలు చెలరేగాయి. రాజకీయమైన కోరికపట్ల గాంధీజీ విముఖత్వమే అందుకు కారణమని స్ప్రాట్ భావించాడు. అప్పుడే నేను కూడా గాంధీజీకి జైలునుంచి ఒక లేఖ వ్రాశాను. తొందరపడి మనం పరిష్కారం కుదుర్చుకుంటే, చాలినంత బలం మనం చూపకపోవడంవల్ల షరతులు మనకు

పూర్తిగా అసంతృప్తికరంగా ఉంటాయని నేను వ్రాశాను. గాంధీజీ నాతో ఏకీభవించాడు. అప్పుడే ఒడంబడిక కుదుర్చుకుంటే, వెంటనే సమస్యలను తిరగదోడడానికి వీలులేదు గనుక సంయుక్తంగా స్వరాజ్యంకోసం తిరిగి ఆందోళన ప్రారంభించడానికి వీలయ్యేదికాదు. గాంధీజీ ఆ సమావేశంలో పాల్గొనక పోవడానికి కారణం ఇదే కాని, స్వరాజ్యంపట్ల వైముఖ్యం కాదు.

ఆయన మనకు సత్యాగ్రహాయుధాన్ని ప్రసాదించాడు. అది కేవలం విరోధి నెదిరించడానికే కాదు, స్వశిక్షణకు కూడా అనువైన ఆయుధం. అది వ్యక్తిగతమైన దౌర్బల్యాన్ని తొలగిస్తుంది. విప్లవతుల్యమైన నైతికావకాశాన్ని మనకు ప్రసాదిస్తుంది.

అర్ధ శతాబ్దం గడిచి, ప్రపంచంలో ఎన్నోమార్పులు వచ్చిన తరువాత ఇంకా 'ప్రయోగించడ'మనే మాటను వాడడాని కభ్యంతరం లేకపోతే, ఈ సత్యాగ్రహాయుధంతో దక్షిణాఫ్రికాలో ఆదర్శవంతమైన ప్రయోగం జరిగిందని అనవచ్చు. ఎక్కువగా తెలియని పేదప్రజలు బలవత్తరమైన శక్తిని ప్రతిఘటించడానికి అక్కడ సత్యాగ్రహోద్యమాన్ని సాగించారు. నియమావళి నుల్లంఘించిన సంఘటనలు లేనే లేవని చెప్పాలి. ఆ ఉద్యమం ఎనిమిదేళ్ళపాటు సాగింది. ఒక దశలో గాంధీజీకి పదహారుమంది అనుచరులే ఉన్నారు. కాని చివరకు దాదాపు ప్రజలందరూ ఉద్యమంలో చేరడం, ప్రభుత్వంనుంచి సంతృప్తికరమైన షరతులను రాబట్టడం జరిగింది.

మహత్తరమైన ఈ ప్రయోగాన్ని సింహావలోకనం చేస్తూ గ్రెగ్ వ్రాసినట్లు, దీనివల్ల తన విధానాన్ని పాటించడంలో తటస్థపడే కడగండ్ల నెదుర్కొనడానికీ, నియమాలను పాలించడానికీ సామాన్యులైన పేదప్రజలకు గల శక్తి పట్ల గాంధీజీకి అచంచలమైన విశ్వాస మేర్పడింది. ఈ విధానపు ప్రభావంపట్ల కూడా ఆయనకు తిరుగులేని నమ్మిక కుదిరింది.

ఒక దేశంపై శత్రుసేనలు దాడి చేసినప్పుడు సత్యాగ్రహ విధానానికి గాని, గాంధేయపద్ధతులలో ప్రతిఘటనకు గాని అవకాశముందా ?

ఉన్నదనే గాంధీజీ భావించాడు.

దాడిచేసి అన్యాయంగా రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకుని, తన సైన్యపు మద్దతుతో పాలించే విజేత పరిపాలనకు బద్ధులుకావడానికి ప్రజలందరూ నిరాకరించి, సంపూర్ణంగా సహాయనిరాకరణాని కుద్యమించి, అవసరమైతే అసువులనైనా అర్పించడానికి సంసిద్ధులై వారు కష్టాలను సహిస్తే, అప్పుడా విజేతగాని, అతడి సైన్యంగాని పరిపాలన సాగించలేదని గాంధీజీ దృఢవిశ్వాసం. అయితే ఈ మార్గం కేవలం అసాధ్యం కాకపోయినా అతికష్ట సాధ్యమైనదని దేశాలు చిరకాలంగా భావిస్తూవచ్చాయి. అందుచేతనే అవి పశుబలాన్ని పశుబలంతోనే ఎదుర్కొనడంకోసం సదా సైన్యాల నాయత్తం చేసుకున్నవి. గాంధీమార్గం బోధించే ఆమరణ సహాయనిరాకరణ విధానంకన్న సైన్యాలను

కూర్చుకోవడమే సులభమని ప్రపంచంలోని వివిధ దేశాలు భావించాయి. తాను సూచించే అహింసాయుత ప్రతిఘటన విధానంతో సాధించరాని లక్ష్యమంటూ లేదని, దాని శక్తి అమేయమని గాంధీజీ అభిప్రాయం. దురాక్రమణ గావించిన సైన్యంతో, దాని నాయకులతో ఎవ్వరూ సహకరించక పోతే, ఆజ్ఞలను పాలించకపోతే, వారికి ఆహార పానీయాలను సమకూర్చడంకోసం పాటుపడడాని కంగీకరించకపోతే అప్పుడా సైన్యం విఫలంచెంది, తన ప్రయత్నాన్ని విరమించుకోక తప్పదని గాంధీజీ నమ్మకం. అయితే ఏజాతికైనా ఈవిధంగా పూర్తిగా అహింసాయుతంగా ప్రతిఘటించడానికి కావలసిన స్థైర్యమూ, దీక్షాతత్పరతా లేకపోతే, ఆ జాతి విజేత పరిపాలనకు పూర్తిగా అసమ్మతంగా లేదన్నమాట. స్వపరిపాలనగాని, ఆ పేర చలామణీ అయ్యే ప్రభుత్వమే గాని తమకు కావాలని వారు మనసార వాంఛించడం లేదన్నమాట. నిజంగా వారు పరప్రభుత్వానికి సమ్మతి చూపని వారైతే, అంతకంటె చావే మేలనుకుంటారు. ప్రజలందరూ ఏకమై ప్రతిఘటించిననాడు వారి ఉద్యమం విజయవంతమై తీరుతుంది. ఈ విధంగా స్వయంగా ఎన్ని కష్టాలనైనా భరిస్తూ కేవలం అహింసాయుతంగానే ప్రతిఘటించగల శక్తి ప్రజలకు లేనినాడు బలప్రయోగంతో ప్రతిఘటించడానికి ఆయన సమ్మతిస్తాడు. అయితే హింసాత్మకమైన ప్రతిఘటనలో విజయం చేకూరేది కేవలం ధర్మానికి కాదు. ఎవరికెక్కువ పశుబలముంటే వారికే విజయం లభిస్తుంది. అహింసాయుతమైన ప్రతిఘటన సంగతి వేరు. ప్రజలందరూ ఆమరణ

దీక్షతో అహింసాయుతంగా ప్రతిఘటిస్తే వారికి విజయం చేకూరడం తథ్యం. అప్పుడు పశుబలానికి గాక ధర్మానికి విజయం చేకూరుతుంది.

గాంధీజీ తత్త్వమిది. సత్యాగ్రహం సాధించలేని లక్ష్యమేదీ లేదని ఆయన దృఢ విశ్వాసం.

దుర్మార్గాన్ని ప్రతిఘటించడం మానవుని కర్తవ్యమని గాంధీజీ అభిప్రాయం. దుర్మార్గాన్ని ప్రతిఘటించవద్దని టాల్‌స్టాయ్ బోధించాడు. ఏసుక్రీస్తు కూడా ఆవిధంగానే బోధించాడు. కాని ప్రతిఘటించకపోవడం కాదు, సహాయ నిరాకరణ విధానంతో ప్రతిఘటించాలని, అప్పటికీ లొంగకపోతే శాంతియుతంగా దుర్మార్గాన్ని ప్రతిఘటించి తీరాలని గాంధీజీ బోధించాడు. దుర్మార్గాన్ని ప్రతిఘటించకుండా వదలివేయడం కాదు, దానికి లొంగకపోవడంవల్ల కలిగే కష్టాలన్నిటినీ సహిస్తూ శాంతియుతంగా దానిని ప్రతిఘటించాలి. చెడుగును చెడుగుతో ప్రతిఘటించకూడదని, దానికి వ్యతిరేకగుణమైన మంచితో చెడుగును పరిహరించాలని ఏసుక్రీస్తు చేసిన బోధనే టాల్‌స్టాయ్ అనుసరించాడు. చెడుగుకు లోబడకపోవడంవల్ల కలిగేకష్టాలను సహించడం గాంధీజీ బోధించిన అహింసాయుత ప్రతిఘటనలో ముఖ్యం. తనకు సమ్మతం కానిదానితో తలపడవలసివచ్చినప్పుడు పౌరుని కర్తవ్య మిదేనని అమెరికా దేశపు మేధావి థొరో ప్రవచించాడు. గాంధీజీ ఈ విషయంలో పూర్తిగా థొరో బోధననుసరించాడు.

దుర్మార్గాన్ని ప్రతిఘటించరాదనే క్రైస్తవ మత బోధకూ, గాంధీజీ రూపొందించిన సత్యాగ్రహ విధానానికీ తాత్వికంగా సాన్నిహిత్యం చాలా వున్నప్పటికీ, ఈ రెండు పద్ధతులమధ్యనున్న ఈ భేదాన్ని దృష్టిలో ఉంచుకోవాలి.

## సమన్వయం

గాంధీజీ మతాచారాలకు విముఖుడు కాడు. కాని అంతగా ముఖ్యంకాని అంశాలకు సంబధించినంతవరకే ఆయన ఆచారాలను ఆలోచనతో నిమిత్తం లేకుండా పాటించేవాడు. ముఖ్యాంశాలను తరచి తరచి చూచి తన బుద్ధికి అవి ఆచరణయోగ్యమని నమ్మికకుదిరితేనే వాటి నామోదించేవాడు. తన బుద్ధికి సరియైనవని తోచకపోతే అతి ప్రాచీన శాస్త్రాల ప్రమాణాన్నికూడా తాను లెక్క చేయనని ఆయన అన్నాడు. అవధులెరుగని ఈ స్వాతంత్ర్యం ముఖ్యాంశాల విషయంలోనే ప్రదర్శించాడు. ఇతరాచారాలకు సంబంధించినంతవరకు అవి వ్యక్తుల నిశ్చితాభిప్రాయాలకు గాని, నైతిక సూత్రాలకుగాని వ్యతిరేకంగా లేకపోతే, వాటిని పాటించడంలో సమాజపు కట్టుబాటును గౌరవించాలని ఆయన భావించాడు.

గాంధీ తత్త్వాన్ని పాఠశాలలలోని ఆటల పోటీలలో పిల్లలాడే మూడుకాళ్ళ పరుగుపందెంతో పోల్చవచ్చు. తన జీవితంలో ఆచరణతో ముడివడి వుండడంవల్ల ఆయన ఊహాలు నిదానంగా ముందుకు సాగేవి. నిజ జీవితంలో తా నాచరించి చూడని ఏ సిద్ధాంతాన్నీ ఆయన ఇతరులకు

బోధించేవాడు కాడు. స్వయంగా ఆచరించడమనే అవ రోధం లేనందువల్ల ఇతరుల ఊహలు శరవేగంతో ముందుకు దూసుకుపోయేవి. తాను బోధించే అంశాలన్నిటినీ స్వయంగా జీవితంలో అనుసరించాలని ఆయన కోరి యేర్పరచుకున్న నియమం ఆయన ఊహల స్వైరవిహారాని కాటంకంగా ఉండేది. గాంధీజీని గురించి భారతీయ విద్యాభవన్ సంస్థ ప్రచురించిన పుస్తకానికి ఆదర్శవాక్యంగా రచయిత శ్రీ చంద్రశంకర శుక్లా గ్రీక్ తత్త్వజ్ఞుడైన ఎపిక్టెటస్ సుభాషి తాన్నే ఎంచుకున్నాడు. అది ఆ సందర్భాని కత్యంత సమంజసంగా, భావోద్దీపకంగా వుంది. "ఒక సిద్ధాంతాన్ని వ్యక్తి అనుదినం తన జీవితంలో అనుసరిస్తూ సదా దానిని పాటిస్తేనేగాని అది అతనిది కావడం సులభసాధ్యం కాదని మీరు గుర్తించాలి" అని ఎపిక్టెటస్ అన్నాడు. గాంధీజీ తన సిద్ధాంతాలనన్నిటినీ ఈ విధంగా నిజజీవితంలో ఆచరించి చూపాడు. ఆయన తత్త్వంలోనూ, జీవితంలోనూ కానవచ్చే విశిష్టత అదే.

అన్ని మతాలూ దైవదత్తమైనవేనని, ఏ యే జాతుల వారి కోసమేయే మతాలుద్దేశింపబడినవో, వారికి సంబంధించినంతవరకు అవి సత్యమైనవీ, అవసరమైనవీ నని గాంధీజీ విశ్వసించాడు. అదే ఆయన బోధించాడు. మన మందరం వివిధ మతగ్రంథాలను వాటి ననుసరించేవారి దృక్పథాలనుంచి చదువగలిగితే, మౌలికంగా అన్నీ ఒక్కటే నని, అన్నీ సత్యమైనవేనని గుర్తించడం జరుగుతుంది. గాంధీజీ 1914 మార్చి నెలలో ఒక యూదుజాతి స్త్రీకి జాబు

వ్రాస్తూ, "నీవు హిందూమతాన్ని స్వీకరించనక్కర లేదు. యూదు మతాన్ని చిత్తశుద్ధితో పాటిస్తే చాలు. యూదు మతం నీకు తృప్తికరంగా లేకపోతే మరేమతమైనా ఎక్కువ కాలం నీకు సంతుష్టిని కలిగించలేదు. యూదు మతాన్నే అనుసరిస్తూ ఇతర మతాలలోని మంచిని నీవు గ్రహించడం మేలని నా సలహా" అని సూచించాడు.

క్రైస్తవులు, యూదులు, మహమ్మదీయులు, బౌద్ధులు, జొరాష్ట్రియనులు, హిందువులు - ఏ మతస్థులైనా కాని వ్వండి, సత్యంకోసం మరొకచోట అన్వేషించక, ఇతరుల విశ్వాసాలను చెదరగొట్టి వారిని తమ మతంలో కలుపుకోవ డానికి ప్రయత్నించక, అందరూ ఇతోధికంగా తమ మత ధర్మాలను చిత్తశుద్ధితో పాటించడం శ్రేయస్కరమని గాంధీజీ అభిప్రాయం. ప్రతి వ్యక్తికీ తాను జన్మమెత్తిన మతంలోనే అవసరమైన సత్యం లభిస్తుందని ఆయన భావిం చాడు. గాంధీజీ మతాలను గురించి వ్యక్తంచేసిన ఈ అభి ప్రాయాన్ని నేను ప్రస్తావించినప్పుడు కొందరు నాతో వాదిం చారు. "మీరు చెప్పేమాట సరేగాని, సత్యాన్ని స్వార్థంతో మేమే దాచుకోక ప్రపంచంలోని దేశదేశాల ప్రజలకు చాటి చెప్పవలసినదని క్రీస్తు మమ్మల నాదేశించాడు. ఇది క్రైస్తవ మతంలో ఒక ముఖ్యాంశం. మేము అవశ్యం పాటించవలసిన విధి. అయినప్పుడు మేము మా కర్తవ్యాన్ని ఎట్లా విస్మరించగలం?" అని క్రైస్తవు లంటారు. మహమ్మ దీయులు కూడా ఈ విధంగానే వాదిస్తారు. "అన్ని మతాలూ సత్యమైనవేనని మీ హిందూమత గ్రంథాలు ఘోషిస్తున్నవి

గనుక ఇతరులను మీ మతంలో కలుపుకోవలసిన అవసరం మీకు లేదు. కాని సత్యాన్ని ప్రపంచంలో అన్నిజాతుల ప్రజలకు అందించవలసినదని మా ప్రవక్త ఆదేశించాడు గనుక మేము మీవలె ఉపేక్షించడానికి వీలుకా" దని వాళ్ళంటారు. చూడటాని కిది సమంజసమైన వాదంగానే కనిపిస్తుంది. చర్చలద్వారా గాని, మరొక విధంగా గాని ఇతరుల మత విశ్వాసాలను చలింపజేయరాదన్న గాంధీజీ బోధ కిది ఖండనగాకూడా సరియైనదిగానే తోస్తుంది. కాని భక్తిపరులైన క్రైస్తవులూ, మహమ్మదీయులూ, తదిత రులూ సత్యాన్ని నలుగురికీ చాటి చెప్పవలసినదన్న ఆదే శాన్ని తమ భక్తికి అవగాహననుకూడా జోడించి పరిస్తే, దాని అంతరార్థం వారికి స్ఫురించగలదు. వారిని బోధించ వలసినదని మత గ్రంథాలు శాసించేది విశ్వజనీనమైన సత్యాన్ని. అంతేగాని నిర్దిష్ట పరిసరాలలో ఆ సత్యాన్ని సంరక్షించడానికి దానిచుట్టూ ఏర్పడిన ఆచారాలనూ, అప్రధానమైన ఇతర వివరాలనూ కాదు. క్రీస్తూ, మహ మ్మదు ప్రవక్తా చేసిన బోధలను దీక్షా తత్పరతతో, విశాల దృష్టితో పరిస్తే, వారు దేనిని ప్రచారం చేయవలసిన దన్నారో, ఎవరిదగ్గర చెయ్యవలసినదన్నారో అర్థమవు తుంది. ఐహిక సంపదల కన్న ఆధ్యాత్మికౌన్నత్యం అధిక ప్రశస్తమైనదని, ఈ జగత్తును పరాత్పరుడు పాలిస్తున్నా డని, ఆయన శాసనాన్ని ధిక్కరిస్తే వినాశనం తప్పదని — ఈ సత్యాన్ని తెలియనివారికి బోధించవలసినదని ప్రవక్తలు తమ శిష్యుల నాదేశించారు. వారి ఆదేశం నమ్మిక లేని

వారికి మతవిశ్వాసాన్ని బోధించవలసినదని. అంతేగాని నమ్మకమున్నవారి విశ్వాసాన్ని చెదరగొట్టవలసినదనికాదు. దేవుడే లేడనే వారిలో దైవంపట్ల విశ్వాసం కలిగించడమే వారి ఆదేశపు లక్ష్యం. క్రైస్తవ సువార్తలలో గ్రంథస్థమైన క్రీస్తు బోధనుగాని, ఖురానులో గ్రంథస్థమైన మహమ్మద్ ప్రవక్త బోధనుగాని సమగ్రంగా, హృదయ పూర్వకంగా పాటించేవారికికూడా మతాంతరీకరణానికి గాంధీజీ చెప్పిన అభ్యంతరం తప్పక వర్తిస్తుంది. వారి బోధ తాము విన్న సందేశాన్ని నలుగురికీ వినిపించవలసినదని. ఆసందేశం చుట్టూ ఏర్పడిన వ్యవస్థను మరింత పెంపొందించడానికి ప్రయత్నించవలసినదని కాదు.

"అన్ని మతాల ప్రవక్తలపట్ల, ఋషులపట్ల నాకు పూజ్యభావమున్నది. ఇందుకు నన్ను దూషించేవారిపై కోపం తెచ్చుకోకుండా నిగ్రహించుకోగల శక్తిని ప్రసాదించవలసినదని నేను దైవాన్ని ప్రార్థిస్తా" నని గాంధీజీ తరచుగా అంటూ ఉండేవాడు.

డాక్టర్ రాధాకృష్ణన్ నుడివినట్లు గాంధీజీ మతం హేతుబద్ధమైనది, నైతికమైనది. తన బుద్ధికి సరియైనదని తోచని విశ్వాసాన్నిగాని, తన అంతఃకరణానికి సమ్మతంగాని మతవిహితమైన కర్మనుగాని ఆయన పాటించలేదు. అయితే మొండిపట్టుదలగల వ్యక్తులు తమకు కలిగిన ప్రతి సంకల్పాన్నీ అంతఃకరణ ప్రబోధంగా భ్రమించరాదని గాంధీజీ పలుమారులు హెచ్చరించాడు. నిజానికి పూర్తిగా

క్రమశిక్షణకు కట్టుబడి పవిత్రజీవితం గడిపే వ్యక్తికి మాత్రమే తన అంతఃకరణాన్ని అనుసరించి కృషిచేస్తున్నానని చెప్పే హక్కుంటుందని గాంధీజీ స్పష్టంగా చెప్పాడు.

ఈవిధంగా గాంధీజీ మతాన్ని హేతువాదదృష్టితో చూచినా, హిందూమత గ్రంథాలపట్ల ఎనలేని భక్తి భావాన్ని ప్రదర్శించడానికి ఆయన దృక్పథం అడ్డురాలేదు. కాని ఆయన ఆ గ్రంథాలకు తన హేతువాదాని కనుకూలంగా అర్థం చెప్పేవాడు. రామాయణ భారతాలు ఉదాత్త ధర్మ ప్రబోధంకోసం వెలసిన అన్యాపదేశ కావ్యాలని, రాముడు దైవానికొక పేరని ఆయన భావించాడు.

కమ్యూనిస్టులు "బూర్జువాగుణా" లని వర్ణించేవాటినే గాంధీజీ ఆచరించాడు, ఇతరులకు బోధించాడు. స్వయంగా ఆచరించి చూపడమే ఆయన ప్రచార సాధనం. అందుకే అది అత్యంత ప్రభావాన్వితమైనది. ఈ గుణాల నవలంబించడానికి తోడ్పడే అంశాలను ఆయన ప్రాచ్య, పాశ్చాత్య సంస్కృతులనుంచి గ్రహించి చక్కగా మేళవించాడు. తనకు తెలియకుండానే ఆయన క్రైస్తవ, హిందూ మతాల మధ్య సమన్వయాన్ని సాధించాడు. తరువాత, క్రైస్తవమతంలో నుంచి తాను స్వీకరించిన అంశాలన్నీ హిందూమతంలోనే నెలకొని వున్నసంగతిని ఆయన గుర్తించి, వాటిని తదనుగుణంగా వ్యాఖ్యానించాడు.

గాంధీజీ హిందూమతాన్నే గాఢంగా అంటిపెట్టుకొని వుండడానికి కొంతవరకు దృశ్యాదృశ్యంగా తిలక్ ప్రభావం

కారణం కావచ్చు. ఆయనను క్రైస్తవమత ప్రభావానికి లోనైన హిందువుగా పేర్కొనవచ్చు. మదరాసులో 1897 లో వివేకానందస్వామి మాతో మాట్లాడుతూ, "బ్రహ్మ సమాజ సభ్యులా! వారు క్రైస్తవమతంలోని యూని టేరియన్ చర్చిలో బయటికి వెల్లడికాని సభ్యులు" అని వర్ణించాడు.

గాంధీజీ యోగసమాధివంటి ఆధ్యాత్మికానుభూతిని పొందలేదు, పొందినట్లు చెప్పుకోనూ లేదు. గాంధీజీ యోగ సాధన చేశాడని కొందరు - ముఖ్యంగా పాశ్చాత్యు లనుకుం టారు. యోగానికి శాస్త్రసంబంధమైన అర్థంకాక, సర్వకర్మల లోనూ సంయమం కలిగి వుండడమనే అర్థం చెప్పుకుంటే, ఆయన నిశ్చయంగా యోగసాధన చేశాడని చెప్పవచ్చు.

ఆత్మ నిగ్రహంద్వారా ఆయన తన కోర్కెల నన్ని టినీ పేదలకు సేవచేయాలనే ఒక్క కోరికగా పరివర్తనం చేసుకున్నాడు. సత్యమే తన జీవితాన్ని శాసించే ఏకైక ధర్మమని నిర్ణయించుకున్నాడు. దైవంపై పరిపూర్ణ విశ్వా సమూ, కష్టాలలోనూ, నిస్పృహ చెందినప్పుడూ శరణాగతి భావమూ ఆయనకు శక్తి నిచ్చాయి.

అహింసా సిద్ధాంతాన్ని మనం ధర్మశాస్త్ర సూత్రంగా తప్పుగా అర్థం చేసుకోకూడదు. గాంధీజీ నేల విడిచి సాముచేసే వ్యక్తికాడు. "తెలిసికాని, తెలియక కాని మనిషి నిత్యజీవితంలో హింస చేయకుండా ఒక్క క్షణం కూడా జీవించలేడు. అందువల్ల తన కర్మలన్నిటినీ కరుణా దృష్టితో కొనసాగిస్తే, అహింసా వ్రతాన్ని పాలించడమే

అవుతుం''దని గాంధీజీ అన్నాడు. మనస్సే అహింసకు పీఠం. అహింసావాది ఒకప్పుడు చంపడానికైనా అవకాశమున్నది కాని ద్వేషించడాని కెన్నటికీ అవకాశంలేదని స్ప్రాట్ అనే రచయిత సాహసించి చేసిన వ్యాఖ్య సమంజసమైనదే. అహింసాసూత్రం కన్న కరుణ ఇంకా స్పష్టంగా బోధపడు తుంది. కరుణను, ప్రేమను జీవిత ధర్మంగా అవలంబించవల సినదని గాంధీజీ అర్థించాడు. బ్రిటిష్ ప్రభుత్వంతో పోరాడ డానికొక ఆయుధంగా గాంధీజీ అహింసను బోధించాడు. తాను పాటించాడు. అయితే అహింస ప్రయోజనం ఆ పోరా టానికే పరిమితంకాలేదు. అది కేవలం సమరం సాగించ డానికి మార్గమేకాదు. శాంతిని సంపాదించడానికీ, జీవించ డానికీ అహింస ఆదర్శమార్గమే. అందుకే 'హింసకానిది' అని వ్యతిరేకభావాన్ని సూచించే 'అహింసా' శబ్దంకన్న, 'కరుణ', 'ప్రేమ' అనే పదాలెక్కువ భావస్ఫోరకమైనవి.

నాగరికతను గురించి గాంధీజీ పూర్తిగా సనాతన హిందూ దృక్పథాన్ని ప్రకటించాడు. నాగరికత అంటే అవ సరాలను ఎక్కువ చేసుకోవడంకాదు. బుద్ధిపూర్వకంగా, స్వచ్ఛందంగా అవసరాలను పరిమితం చేసుకోవడమే నాగ రికత అని ఆయన భావించాడు. అవసరాలను తగ్గించు కోవడంలోనే నిజంగా సుఖమున్నది. సేవచేసే శక్తి అందు వల్ల పెరుగుతుంది.గాంధీజీ బోధించిన ఈ మాటను స్వరాజ్యం వచ్చాక మరచిపోవడం జరిగింది. ఎవరో కొద్దిమంది అను చరులుమాత్రం కాలంతోపాటు మారక ఇంకా ఆ బోధ ననుసరించడానికి యత్నిస్తున్నారనుకోండి. పారిశ్రామికాభ్యు

దయం కావాలని నెహ్రూ తదేక దీక్షతో ఘోషిస్తూ కృషి చేయడంతో స్వాతంత్ర్య సమరకాలంలో గాంధీజీ చేసిన బోధ పూర్తిగా తుడిచిపెట్టుకుపోయింది. ఇట్లా జరుగుతుందని ప్రాట్ ముందుగానే ఊహించాడు.

గాంధీజీ వ్రాతలలోనూ, ప్రసంగాలలోనూ భారత ప్రజల ధర్మ,సంస్కృతులకూ, పాశ్చాత్యులనుంచి మన దేశం లోని ఇతర మేధావులతోపాటు ఆయన గ్రహించిన ఆధునిక భావాలకూ ఫలప్రదమైన సమన్వయం గోచరిస్తుంది. ఆయన అభిప్రాయాలు ప్రయోజనకరమైనవి. కేవలం మొండి సిద్ధాంతాలు కావు.

గాంధీజీ ఆధ్యాత్మిక చింతగలవాడే కాని, ఆయనకు కేవలం శాస్త్రాధ్యయనంలోనూ, తాత్త్విక చర్చలలోనూ ఆసక్తిలేదు. అన్నిటినిమించి ఆయన నైతికదృష్టికి ప్రాధాన్యమిచ్చాడు. నీతిని గురించి ఆయన అభిప్రాయాలు సామాన్య ప్రజలకు కూడా సులభంగా బోధపడతాయి. రాజకీయవేత్తగానూ, సంఘ సంస్కర్తగానూ ఆయన తన కార్యకలాపాలను ఎంతో నేర్పుగా, అనుభవపూర్వకంగా, సమగ్రంగా కొనసాగించాడు.

క్రియారూపంలో పరహితానికై పాటుపడడం, అవసరమున్న వారందరికీ సేవచేయడం, కేవల సంప్రదాయం కన్న అంతఃకరణానికే ప్రాధాన్యమివ్వడం, జ్ఞానంకన్న నీతీ, విశ్వాసమూ, సత్కర్మలూ ముఖ్యమని భావించడం, బ్రహ్మచర్యాన్నీ, కఠోరనియమ నిష్ఠాయుక్తమైన జీవితాన్నీ ఉత్తమ

మని ఎంచడం—ఈ అంశాలన్నీ క్రైస్తవ మతానికీ, హిందూ మతంతోపాటు ఇంకా ఎన్నో ఇతర మతాలకూ సమాన ధర్మాలే. ఐనా క్రైస్తవులు మాత్రం ఇవి కేవల క్రైస్తవ ధర్మాలని విశ్వసిస్తారు. అన్ని మతాలలోనూ కనిపించే ఈ అంశాలను తమిళ ఋషి తిరువళ్ళువార్ ముఖ్యమైనవిగా ప్రబోధించాడు. ఆయన క్రీస్తుశకం మొదటి శతాబ్దంలో ఉన్నాడని కొందరంటారు. క్రైస్తవ మత ప్రభావంవల్లనే తిరువళ్ళువార్ ఈ ధర్మాలను ప్రబోధించాడని కొందరు ప్రముఖ బ్రిటిష్ మిషనరీలు భావించారు. వారి ఊహ అసంగతమైనది కావచ్చు. కాని గాంధీజీ ఈ ధర్మాలకు ప్రాధాన్యమివ్వడానికి కారణం క్రైస్తవ మతమూ, గ్రంథస్థమైన క్రైస్తవ మతాచార్యుల చరిత్రా ఆయనను ప్రభావితం చెయ్యడమేనని స్ప్రాట్ వ్రాసిన మాటను మనం కొట్టి వెయ్యలేము. ఎందుకంటే గాంధీజీని క్రైస్తవమతమూ, టాల్‌స్టాయ్ రచనలతోసహా పాశ్చాత్య సాహిత్యమూ అత్యధికంగా ఉత్తేజితం చేసినమాట వాస్తవమే. హిందూ మత గ్రంథాలను ఆయన క్షుణ్ణంగా చదవలేదు. కేవల సంప్రదాయవాది కాడు. క్రైస్తవమతంనుంచి, ఆ మతాచార్యుల రచనలనుంచి గాంధీజీ తనకు నచ్చిన భావాలను యథేచ్ఛగా గ్రహించాడు. ఆ భావాలు హిందూమతం బోధించే ధర్మాలకు పూర్తిగా అనుగుణంగా ఉన్నవని గుర్తించి, ఆయన వాటిని హిందూ ధర్మ సూత్రాలుగానే జన సామాన్యంలో ప్రచారం చేశాడు. అందువల్ల ఆయన వారిని పూర్తిగా

సంస్కరించలేకపోయినా, వారికిమాత్రం ఆదర్శపాత్రుడై మహాత్ముడయ్యాడు.

గాంధీజీ చేతలనుబట్టి గాక కేవలం ఆయన అన్న మాటలనే ఆధారంగా చేసుకుని మనం ఆయనను గురించి అభిప్రాయాలనేర్పరచుకోవడం సమంజసం కాదేమో. ఎందుకంటే, నిజంగా జరిగినదేమైనప్పటికీ, ఆయన ఇతర ప్రభావాలకూ, ఆధునిక ధోరణులకూ లోనుగావడంకన్న హిందూ మతంమీదనే పూర్తిగా ఆధారపడాలని అభిలషించాడు. అంతేకాదు. ఆయన విశిష్టత సువిదితమైనది గనుక, ఆయనను గురించి ప్రజలు పాక్షికదృష్టితో తమ అభిప్రాయాలను వ్యక్తంచేస్తారు. క్రైస్తవ మత ప్రభావమే అయన విశిష్ట గుణాలకు కారణమని క్రైస్తవు లంటారు. ఆయన ఊహాలను, నిశ్చయాలను తమ ధార్మిక, నైతిక సూత్రాలే రూపొందించినవని హేతువాదానుయాయులూ, ఆధునికులూ చాటుతారు. నిజం తేల్చాలంటే, జీవితాన్ని గురించి గాంధీజీ సిద్ధాంతాలపట్ల సనాతన హిందువుల వైఖరి యేమిటో గమనించాలి. ఆయన సిద్ధాంతాలకు మొత్తంమీద వారు విముఖులే కాని, రాజకీయ రంగంలో ఆయన సాధించిన విజయానికీ, పొందిన ప్రజాభిమానానికీ వశులై ఆయనను ఖండించలేకపోయారు. మొత్తంమీద సాంప్రదాయిక హిందూమతం నుంచి కొన్ని మౌలికమైన విశ్వాసాలాయనకు పుట్టుకవల్ల అలవడినప్పటికీ, ఆధునిక భావాల ప్రభావం గాఢంగాపడి ఆయన దృక్పథాన్ని రూపొందించిందని నే ననుకుంటాను. సామాన్య ప్రజలమధ్య ఆయన కృషి చేయవలసివచ్చింది.

వారిలో కలిసిపోతేనేగాని వారిని సంస్కరించడానికి వీలు కాదు. అందువల్ల ఆయన తన సిద్ధాంతాలకూ, ప్రవర్తనకూ హిందూమతంలో ఆమోద ముద్రనిచ్చే ఆధారాలను గుర్తించి తాను నూటికి నూరుపాళ్ళు హిందువుగానే ఈ పను లను చేస్తున్నట్టు విశ్వసించాడు. ప్రజలు కూడా అట్లాగే భావించారు. దైవం, దైవకృప ఆయనకు ఏకైక రక్ష. దైవం పట్ల అంతటి అచంచల విశ్వాసంగల వ్యక్తి సంప్రదాయ విరుద్ధమైన అభిప్రాయాలను కొన్నిటిని ప్రకటించినా, అత డిని సనాతన హిందూమతావలంబిగానే పరిగణిస్తారు. మొత్తంమీద ఆయన తన నైతిక సిద్ధాంతాల నన్నిటినీ హిందూమతంనుంచి గాక, క్రైస్తవమతంనుంచీ, వర్తమాన పాశ్చాత్య నైతిక విశ్వాసాలనుంచీ గ్రహించాడనీ, హిందూ మతంకూడా వాటిని సమర్థించడం మాత్రమే జరిగిందనీ చాలామంది అనే మాటను కాదనలేము. అయితే ఆయన హిందువుగా పుట్టి పెరిగాడు గనుక, హిందూమత ప్రభావమే అతిముఖ్యమైనదనే మరికొందరి వాదాన్ని కూడా ఖండిం చడం కష్టమే. భగవద్గీతా గ్రంథంతో తన అనుబంధాన్ని గురించి ఆయన స్పష్టంగా వెల్లడించిన అభిప్రాయాన్నికూడా నిరాకరించడానికి వీలులేదు. ఆయన పురాణాలను అన్యాప దేశ గాథలుగా భావించాడు. అయినా ఆయన సగుణోపాస నకు సమ్మతించాడు. ముఖ్యంగా క్లేశాల నెదుర్కొన్నప్పుడు దైవాన్ని గుణ రూప సహితునిగానే ఊహించుకున్నాడు. ఏవిధంగా చూచినా గాంధీజీ సనాతనవాది కాడు. సంప్ర దాయాలమీదకన్న ఆధునిక దృక్పథంమీదనే ఆయన

ఎక్కువ మొగ్గుచూపాడు. అయినా ఆయన తన నవీన భావాలను సంప్రదాయాల ముసుగులో కప్పి అవి సనాతనమైనవేనని స్ఫురింపజేశాడు.

'సత్యం' అనే మాటకు లోకంలో వ్యాప్తిలో ఉన్న అర్థంకన్న విశేషమైన అర్థాన్ని మనసులో ఉంచుకుని గాంధీజీ ఆ మాటను ప్రయోగించటంవల్ల చాలామందికి ఆయన అభిప్రాయం స్పష్టంగా తెలియలేదు. అనుభవానికీ, సిద్ధాంతాలకూ మధ్యనుండే పరస్పర సంబంధాన్ని గాంధీజీ 'సత్య' మన్నాడు. ఆయన దృష్టిలో నైతిక సూత్రాలన్నింటి కలయికయే సత్యం. అందుకే గాంధీజీ "సత్యమే దైవ" మన్నాడు.

గాంధీజీ కొంతవరకు టాల్‌స్టాయ్ సిద్ధాంతాల ననుసరించాడు గాని, అసంభవమైన దానిని సాధించాలనే ఉద్దేశం ఆయనకు లేదు. వ్యత్యాసాలను ఆయన టాల్‌స్టాయ్ కన్న ఎక్కువ సహనదృష్టితో చూశాడు.

మనిషి చేతలు పెరిగిన పరిసరాలమీదనే ఆధారపడతాయనే నిరర్థక వాదాన్ని గాంధీజీ విశ్వసించలేదు. జరుగుతున్న సమస్తం ఇదివరకే నిర్ణీతమైనదని, విధి అనుల్లంఘ్యమనే వాదాన్నికూడా ఆయన అంగీకరించలేదు. పురుష ప్రయత్నం, దైవం జోక్యం – ఈ రెండిటిలో ఆయనకు నమ్మకముంది. మన కర్థం కాకపోయినా ఈశ్వరేచ్ఛయే అనుసరించదగిన ధర్మమని ఆయన ఎప్పుడూ అంటూ వుండేవాడు. సత్యమే దైవమని, దైవం ధర్మమేనని ఆయన తర

చుగా అనేవాడు. ఈ మాటలు క్లిష్టమైన ఒక ధార్మిక సిద్ధాంతాన్ని తేలికగా, సంగ్రహంగా సూచిస్తాయి. వయస్సు పైబడుతున్నకొద్దీ ఆయన ఈ సిద్ధాంతాన్ని కొంతవరకు మార్చుకున్నాడేమోనని నే ననుకుంటాను. పరిసరాలను పూర్తిగా అతిక్రమించడానికి తోడ్పడే ఆత్మ నిగ్రహంలో, ఆత్మోద్ధరణంలో ఆయనకు దృఢ విశ్వాసం ఉండేది.

ప్రేమయే మనిషికి నచ్చజెప్పడానికీ, వశం చేసుకోడానికీ సాధనం. ద్వేషం కాదు. విత్తనాలనుండి చెట్లు మొలిచినట్లు సాధనాలనుండి ఫలితా లంకురిస్తాయి. మనుష్యులు స్వాభావికంగా మంచివారే. చరిత్ర కమ్యూనిస్టులన్నట్టు కేవలం ఆర్థిక కారణాలవల్ల వర్గాలమధ్య కొనసాగే కలహం కాదు. గాంధీజీ సూచనలపై 1934 జూన్ 18 నాడు బొంబాయి నగరంలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఈ క్రింది తీర్మానాన్ని ఆమోదించింది : "వర్గాలమధ్య పోరాటమనీ, వ్యక్తిగతమైన ఆస్తులను బలవంతంగా గుంజుకోవడమనీ ఇటీవల జరుగుతున్న అధిక ప్రసంగాల దృష్ట్యా కాంగ్రెస్‌వారికి కరాచీ తీర్మానాన్ని జ్ఞప్తికి తేవలసిన అవసరం కనిపిస్తున్నది. కొన్ని మూలసూత్రాల నుద్ఘాటించిన ఈ తీర్మానంలో ఎక్కడా న్యాయమైన కారణం లేకుండా గాని, నష్టపరిహారం చెల్లించకుండా గాని వ్యక్తిగతమైన ఆస్తులను స్వాధీనం చేసుకోవాలనే ప్రస్తావన లేదు. వర్గ కలహాలను ఈ తీర్మానం సమర్థించలేదు. వర్గ కలహాలూ, బలాత్కారంగా ఆస్తులను స్వాధీనం చేసుకోవడమూ కాంగ్రెస్

అనుసరించే శాంతియుత విధానానికి వ్యతిరేకమైనవని వర్కింగ్ కమిటీ భావిస్తున్నది.''

సంపద అందరికీ సమానంగా పంపిణీ కావడం ఏనాటికైనా సాధ్యమవుతుందని గాంధీజీకి నమ్మకం లేదు. అందువల్ల పంపిణీ ధర్మబద్ధంగా జరగాలనిమాత్రమే ఆయన కోరాడు. ధనికుల వస్తువాహనాలను స్వాధీనం చేసుకోవడం సరియైన పని యని ఆయన భావించలేదు. ఇట్టి హింసాత్మక చర్య సంఘానికి క్షేమకరం కాదని ఆయన అన్నాడు. ఇట్టి పనులవల్ల సంపద నినుమడింపజేయగల వారి ప్రజ్ఞాపాటవాలు సంఘానికి లభించకపోవడం జరుగుతుంది. అందువల్ల సంఘానికి నష్టమే కలుగుతుంది. అహింసా విధానమే నిశ్చయంగా ఇంతకన్న శ్రేష్ఠమైనది. పెట్టుబడిదారు తన మూలధనాన్ని కూర్చుకోవడానికీ, నిలుపుకోవడానికీ, వృద్ధి చేయడానికీ ఆధారమైన ప్రజలపట్ల తానొక ధర్మకర్తగా భావించి వ్యవహరించాలని గాంధీజీ అభిలషించాడు.

అత్యుత్తమ వ్యవస్థలోకూడా తారతమ్యాలను పూర్తిగా తొలగించడం అసాధ్యమని గాంధీజీ అన్నాడు. వర్గ కలహ సిద్ధాంతం ఆయన కెంతమాత్రం నచ్చలేదు. ధనవంతులు తమ సంపదను, ప్రజ్ఞను ధర్మకర్తృత్వ దృష్టితో సమాజ సేవలో వినియోగించాలని మాత్రమే మనం కోరడం న్యాయం. అంతకంటె అధికంగా కావాలని పట్టుబట్టడం బంగారుగుడ్లు పెట్టే బాతును చేజేతులా చంపుకోవడం వంటిదే అవుతుంది.

"ఉదాత్త లక్ష్యాలతో కూడిన సరళమైన, నిరాడంబరమైన జీవితం గడుపుతూ, వేనవేలుగా నెలకొన్న తన కుటీరాల వికాసానికి కృషిచేస్తూ, దేశాలన్నింటితో శాంతియుత విధానాన్ని అవలంబించడం ద్వారానే, హింసాద్వేషాలతో సంతప్తమై దీనాక్రందనం చేస్తున్న ప్రపంచంపట్ల స్వతంత్ర భారతదేశం తన విధిని నిర్వర్తించగలదని నా విశ్వాసం. ధనమే సర్వస్వమనే నమ్మకతో ఉద్వేగపూరితంగా ప్రాపంచిక వాంఛాతృప్తికోసమే పాటుపడుతూవుంటే ఉదాత్తభావనకు తావుండదు. యంత్రాలే కొన్ని దేశాల ప్రజ లితరదేశాలను కొల్లగొట్టడానికి ఉపకరించాయి. యంత్రాలంటే నా వైముఖ్యానికి ప్రధాన కారణ మిదే. జీవితంలో యంత్రాలకు కూడా స్థానమున్నది. అవికూడా సమాజంలో స్థిరంగా చోటు కల్పించుకున్నవి. యంత్రాలనే నేను ఖండించడం లేదు. యంత్రాలపట్ల ప్రజ లలవరచుకుంటున్న వ్యామోహాన్ని మాత్రమే ఖండిస్తున్నాను. శ్రమలేకుండా చేసే యంత్రాలంటే ఎక్కువ వ్యామోహం కనిపిస్తున్నది. శ్రమ తగ్గించడం, కాలాన్ని పొదుపుచేయటం మంచిదే. అయితే ఈ సౌలభ్యం ఏ కొద్దిమందికో కాదు, మానవజాతి కంతకీ కావాలని నేనంటాను. ఈనాడు యంత్రాల సహాయంతో కొద్దిమంది లక్షలాది ప్రజలవీపుల మీాద స్వారి చేయగలుగుతున్నారు. కార్మికుడి శ్రమ తగ్గించాలనే జీవకారుణ్య దృష్టిగాక, కేవలం అవధులులేని ధనాశయే ఈనాడు యంత్రాల వాడుకను ప్రోత్సహిస్తున్నది.

ప్రభుత్వపు అధికారాలు విస్తృతి చెందితే చాలా నష్టం కలుగుతుందని నా భయం. అందువల్ల ఒకరి నొకరు కొల్లగొట్టడం చాలావరకు తగ్గేమాట నిజమే. కాని మానవాభ్యుదయానికి మూలాధారమైన వ్యక్తిత్వంకూడా నాశనమవుతుంది. మానవ జాతి కా విధంగా మహోపకారం జరుగుతుంది.

ఉన్నది విదేశప్రభుత్వమైనా, జాతీయప్రభుత్వమైనా, ప్రభుత్వపు అదుపునుండి స్వాతంత్రం కావడానికి తెంపు లేకుండా సాగించే కృషియే స్వపరిపాలన అని నా అభిప్రాయం. జీవితంలో అడుగడుగున ప్రతి స్వల్ప విషయానికీ ప్రజలు ప్రభుత్వంమీదనే ఆధారపడే స్థితివస్తే, స్వరాజ్య ప్రభుత్వం నిరర్థకం కాగలదు.''

ప్రభుత్వానికీ, వ్యక్తులకూ చెందవలసిన హక్కులను గురించీ, బాధ్యతలను గురించీ గాంధీజీ వెల్లడించిన అభిప్రాయాలను పైన ఉదాహరించాను. ఇంకా వ్యాఖ్యానిస్తే ఈ ప్రసంగం నేటి రాజకీయ వ్యవహారాలమీదికి మరలవచ్చు. ఆ పని నేను చేయదలచుకోలేదు.

ప్రజాస్వామ్యాన్ని గురించి గాంధీజీ అభిప్రాయాలను పై మాటలవల్ల గ్రహించవచ్చు. ఈక్రింది వాక్యాలను కూడా గమనించండి :

''కొద్దిమంది అధికారాన్ని హస్తగతం చేసుకోవడంవల్ల గాక, అధికారం దుర్వినియోగమవుతున్నప్పుడు దాని నెదుర్కొనే శక్తిని అందరూ అలవరచుకోవడంవల్లనే నిజంగా స్వరాజ్యం

సిద్ధిస్తుందని నేను స్పష్టంగా చూపగలనని ఆశిస్తున్నాను. అధికారాన్ని తగినట్టు మార్చుకుంటూ తమ అధీనంలో ఉంచుకోగల శక్తిని పొందేటట్లు సామాన్య ప్రజానీకాన్ని జాగరితం చేయడంద్వారా స్వరాజ్యాన్ని సాధించాలి.” విదేశీయుల పరిపాలననుండి ఒక జాతి విముక్తి పొందడమే స్వరాజ్యమని గాంధీజీ భావించలేదు. పారతంత్ర్యానికి భిన్నమైన స్వాతంత్ర్యాన్ని వ్యక్తులందరూ అనుభవించే స్థితియే స్వరాజ్యమని ఆయన విశ్వాసం.

ఏ అంశాన్ని గురించి ప్రశ్నించినా, గాంధీజీ సునిశ్చితమైన అభిప్రాయాలను ప్రకటించేవాడు. అన్ని తరహాల వ్యక్తులూ ఆయనను సమీపించి తమ కిష్టమైన అంశాలమీద ఆయన అభిప్రాయాల నడిగేవారు. కాలహరణ మవుతుందనే సంకోచం లేకుండా ఆయన అందరికీ అడిగిన వెంటనే సమాధానా లిచ్చేవాడు. బరువైన సమాధానాలనే ఇచ్చేవా డనుకోండి. అయినా ఈ విధంగా ఆయన అన్నమాట లన్నిటికీ ప్రాధాన్య మివ్వనక్కరలేదు. అంతే కాదు. ఇటువంటి లఘుప్రసంగంలో ఆయన అభిప్రాయాలు వ్యక్తం చేసిన అంశాలన్నిటిని గురించీ ప్రస్తావించడం కూడా సమంజసం కాదు. అందుచేత నే నెన్నో విషయాలను వదలివేసి ఆయన జీవితానికి సంబంధించిన ముఖ్యాంశాలను మాత్రమే చర్చించాను. “నైతిక సూత్రాలను స్వయంగా జీవితంలో ఆచరించి ఆయన లోకాని కుద్బోధించాడు. కేవలం మాటల ద్వారా కాదు, చేతలద్వారా ప్రచారం చేశాడు. ఈవిధంగా

ఆయన సత్యం, దయ, సహిష్ణుత, సాంఘిక ధర్మం, అన్నిటినీమించి ప్రేమ అనే ముఖ్యమైన, ప్రాచీన నైతిక సూత్రాలను లోకానికి చాటా"డని శ్రీ గగన విహారి మెహతా అన్న మాటలు గాంధీ జీవిత సారాన్ని, తత్త్వాన్ని చక్కగా సూచిస్తాయి. వీటికి "ధైర్యం, జయప్రదంగా ఎదిరించడానికి వీలిచ్చే ఏకైక సాధనంద్వారా దుర్మార్గాన్ని ప్రతిఘటించడం" అనే రెండు లక్షణాలను కూడా చేర్చడం అవసరం. ధర్మశాస్త్రానుసారం జయప్రదంగా దుర్మార్గాన్ని ప్రతిఘటించే ఈ విధానాన్ని ఆయన మాటల ద్వారానే కాదు, స్వయంగా ఆచరించి, ఇతరులచేత కూడా ఆచరింపజేసి లోకానికి బోధించాడు. బుద్ధుడు, సోక్రటీస్, ఏసుక్రీస్తు వర్గానికి చెందినవా డాయన. ఆ మహనీయులను గురించి మనం విన్నాము. వారిని గురించి చదివాము. కాని గాంధీజీని స్వయంగా మనం చూశాము. ఆయన మనకోసం చేసిన కృషిని కళ్ళార తిలకించాము. ఇటువంటి భాగ్యం మన మనుభవించినట్టు నిదర్శనం మన జీవితాలలో కొంతగానైనా కనిపిస్తే బాగుంటుంది.

Acc. No.
11,246

320.55
RAJ

రు. 0-75